# ధర్మ శాస్త్రము ఏది




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





# ధర్మశాస్త్రము

## ఏది?

రచయిత: **త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-40 ద్వితీయ ముద్రణ : మే-2018

ప్రతులు : 1000 **వెల : 50 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) సుప్రసిద్ధి బోధ.
98) సిద్ధి బోధ.
99) ప్రవచన మాలిక
100) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
101) రూపము మారిన గీత.
102) సున్న.
103) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

*(DVD'S)*



01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.

82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం
138. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

08



### ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ధర్మశాస్త్రము ఏది?

జగతిలో విచక్షణా జ్ఞానములేని ఏ జీవరాశికీ ధర్మశాస్త్రము అను దానితో పనిలేదు. పూర్తి విశ్వములో విచక్షణ కల్గినవాడు మనిషి ఒక్కడే. అందువలన మనిషి అయిన ప్రతివానికీ ధర్మశాస్త్రమంటే ఏమిటో తెలిసి వుండాలి. ధర్మశాస్త్రము మనిషికి ఆహారమునిస్తుందా, ఆదాయము నిస్తుందా? ఏమాత్రము ఆదాయములేని దానిని గురించి మనిషికేమి అవసరమని కొందరడుగవచ్చును. దానికి జవాబును చూస్తే ధర్మశాస్త్రము వలన ఒక పూట ఆహారముగానీ, ఒక రూపాయి ఆదాయముగానీ ఉండదు. అట్లని కూటికీ కూరకూ పనికి రాని ధర్మములతో మనకేమి పని అని ఎవరూ అనుకొనుటకు వీలులేదు. ఎందుకనగా! ధర్మము మనిషికి ఆదాయమును ఆహారమును ఇవ్వదుగానీ, అది నేరుగా మనిషితోనే సంబంధపడియున్నది. ధర్మము అనునది మనిషి జీవితములో ఒక భాగమైయున్నది. అయినా ఆ విషయము అందరికీ తెలియదు.

ఒక మనిషి ధర్మమును తెలిసి జీవిస్తే దానిని సక్రమమైన జీవితము అనవచ్చును. అట్లుకాకుండా ధర్మమంటే ఏమిటో తెలియక, ఏమాత్రము ధర్మములేని జీవితమును గడిపితే దానిని లోపభూయిష్టమైన జీవితము అంటాము. అతనిది సక్రమమైన జీవితము కాదని చెప్పవచ్చును. మనిషి జీవితములో ధర్మము అనునది వాహనమునకు లైటులాంటిది. చీకటిలో ప్రయాణించు వాహనమునకు (కారుకు) లైటు ఎంత అవసరమో, ధర్మము కూడా మనిషికి అంతే అవసరము. వాహనమునకున్న లైటు వాహనమును నడుపలేదు, నడిచేదానికి శక్తినీ ఇవ్వదు. వాహనము లైటు లేకున్నా నడువగలదు. వాహనము ఎంత ఖరీదుదైనా చీకటిలో దారి తెలియక సక్రమమైన మార్గములో నడువక దారితప్పి నడుచును. అట్లు నడచుట చేత ప్రయాణము ఒడుదుడుకులతో కూడుకొన్నదై, గుంతలు మిట్టలలో కుదుపులకు గురియగుచు నడువవలసి వచ్చును. ఎక్కడైనా పెద్దగుంతగానీ,

పెద్దరాయిగానీ ఎదురైతే ప్రమాదము జరిగి అంతటితో వాహనము యొక్క ప్రయాణము ఆగిపోగలదు. అదే విధముగా మనిషి ఎంత ధనికుడైనా జీవితము పైకి బాగానే గడుచుచుండును. అయితే ధర్మములేని మనిషిలో శాంతి ఉండదు. అతని జీవితము అసంతృప్తి, ఆవేదనలను ఒడుదుడుకులతో సాగుచుండును. ఎప్పుడైనా జీవితములో పెద్ద సంఘటన ఎదురైతే ధర్మము తెలియని మనిషి దానిని తట్టుకోలేడు. జీవించుటకంటే మరణించుటే మంచిదనుకొనును. ఎప్పుడో ఒకప్పుడు దారిలేక వాహనము నిలిచి పోయినట్లు, ధర్మము లేని మనిషి ఎప్పుడో ఒకప్పుడు జీవిత గమ్యమును చేరలేక, దారితెలియని అగమ్యగోచర స్థితిలో జీవితమునే చాలించును.

నేడు చాలామంది తమ ధర్మమును తెలియనిస్థితిలో బ్రతుకుచూ, తనకు అన్నీ సక్రమముగా ఉన్నాయని అనుకొనుచుండును. పగలు లైటు లేకున్నా ప్రయాణించు వాహనమునకు, చీకటిలో రాత్రిపూట తప్పనిసరిగా లైటు అవసరమని అనుకోరు. పగలు లైటు తనలో ఒక భాగమని వాహనమునకు తెలియనట్లు, మనిషికి కూడా ధర్మము తన జీవితములో ఒక భాగమని తెలియనిస్థితిలో చాలామంది బ్రతుకుచున్నారు. జీవితములో మార్గదర్శకమైన లైటులాంటిది ధర్మము. ధర్మమేమిటో తెలియక ధర్మమంటే అర్థమేమిటి? అనే పరిస్థితిలో నేడు మనిషి గలడు. కొందరైతే ఇదేమిటి ఇదేదో క్రొత్తమాట అని అనుచున్నారు. ధర్మమంటే అర్థమేమైనా ఉండ వచ్చునుగానీ, అది లేకపోతే మనిషి మనిషేగాడు అని తలచిన దేవుడు మనిషిని పుట్టించిన పాపానికి, ఆయనే ధర్మమును గూర్చి మనిషికి చెప్పవలసి వచ్చినది. దేవుడు అట్లు శ్రమపడి మనవద్దకు వచ్చి ధర్మమిది అని చెప్పినా, మాకు డబ్బుతో పనిగాని, ధర్మముతో పని లేదుపో అంటున్నారు. డబ్బు లేకపోతే బ్రతుకలేముగానీ, ధర్మము లేకపోతే బ్రతుకలేమా అని తిరిగి ప్రశ్నిస్తున్నారు. గజ్జికుక్క మాంసము లేని ఎముకను కొరుకుచూ ఆహా!

ఎంత రుచిగాయున్నదని అనుకొన్నట్లు, కర్మ మనిషి ధర్మములేని జీవితమును గడుపుచూ ఆహా! జీవితము ఎంత బాగుంది అనుకొంటున్నాడు. కుక్కకు తాను కొరుకుచున్న ఎముక ఏమాత్రము సారములేనిదని తెలియనట్లు, మనిషికి తాను గడుపుచున్న జీవితము ఏమాత్రము సారము లేనిదని, నిరర్థకమైనదని తెలియకున్నాడు.

మాంసము లేని ఎముకను కొరుకు కుక్కకు, ఎముక పొడుచుకొని తన నోటిలో గాయమై రక్తము వస్తుంటే, తన రక్తమునే తాను రుచి చూచుచూ అదంతయు ఎముకలోని రుచే అనుకొని, మాంసముగల ఎముకను తిను కుక్కను చూచి, తన ఎముకను అదెక్కడ లాగుకొనునోయని ప్రక్కకు మళ్ళుకొని చాటుకుపోయినట్లు, ధర్మములేని జీవితమును గడుపువారు ధర్మమున్న వాడు, ధర్మమును తెలిసినవాడు ఎదురైతే వాడు తనను ఎక్కడ చెడగొట్టునో యని తప్పించుకొని తిరుగుదురు.

దీనికంతటికీ కారణము ధర్మము అంటే ఏమిటని గానీ, ధర్మము యొక్క విలువ ఏమిటనిగానీ తెలియకపోవడమేనని అర్థమగుచున్నది. దీనినంతటినీ గమనించిన తర్వాత మానవుడు ధర్మమునకు దూరముగా బ్రతుకుచున్నాడని తెలియుచున్నది

మనుషులలో పేదవాడు మొదలుకొని ధనికుడు వరకూ, పండితుడు మొదలుకొని పామరుని వరకూ, బేవర్షి మొదలుకొని మహర్షి వరకూ, అజ్ఞాని మొదలుకొని స్వామీజీల వరకు అనేక రకముల మనుషులు భూమి మీద కలరు. భూమిమీద గల ఇన్ని రకముల మనుషులలో ధర్మమును తెలిసినవారు ఎందరున్నారని ప్రశ్నించుకొని చూచినట్లయితే, సాధారణ మనుషులు మాకు ధర్మము అంటే ఏమిటో తెలియదని ఒప్పుకొనినా, పండితులు, స్వామీజీలు మాకు ధర్మము తెలియుననీ, ధర్మము ప్రకారమే ప్రవర్తించుచున్నామని చెప్పుచున్నారు. వారు చెప్పు మాట నిజమేనని

మనము ఒప్పుకొనినా దేవుడు మాత్రము ఒప్పుకోడు. ఎందుకనగా! మన లెక్కలో చెప్పబడిన ధర్మము వేరు. దేవుని లెక్కలో చెప్పబడిన ధర్మమువేరు. వారికి తోచినదే ధర్మమనుకొనుట వలన, మేము ధర్మమును తెలిసిన వారమను ధీమాతోయున్నారు. మనుషులు ఎవరికి తోచినది వారు ధర్మమనుకోవడము వలన మనుషుల లెక్కలో ధర్మము శాస్త్రబద్ధముగా లేకుండాపోయి ఊహా జనితమై పోయినది.

కొందరి ఊహలో మనిషి నీతిగా నడుచుకోవడమే ధర్మముగా ఉన్నట్లు అని అనుకొంటున్నారు. ఇంకా కొందరు దానములనే ధర్మము అనుకొంటున్నారు. కొందరేమో యజ్ఞములు చేయడమే ధర్మముగా నడుచు కొన్నట్లని అనుకోవడము జరుగుచున్నది. కొందరు న్యాయముగా నడుచు కోవడమును ధర్మముగా నడుచుకోవడమనుకొంటున్నారు. దొంగ ఇతరులను దోచుకోవడమే ధర్మమనుకొంటున్నాడు. వ్యాపారి ఎదుటి వాని అవసరమునుబట్టి లాభము తీసుకోవడములో తప్పులేదు, అది వ్యాపారము యొక్క ధర్మమంటున్నాడు. క్షత్రియులు యుద్ధము చేసినా తప్పులేదు, యుద్ధములో శత్రువులను చంపినా తప్పులేదు. ఇది క్షత్రియుల స్వధర్మము అంటున్నారు. ఇట్లు చివరకు మనిషి తనకు అనుకూలమైనదంతా స్వ ధర్మమనీ, అనుకూలములేనిది పర ధర్మమనీ అంటున్నాడు. ఇన్ని రకములలో ఏది అసలైన ధర్మమో తెలియకుండా పోయినది. భవిష్యత్తులో ధర్మమును గురించి ఇటువంటి సమస్యలు ఏర్పడుతాయని తెలిసిన దేవుడు, సృష్ట్యాది లోనే ధర్మములను గూర్చి తెలియజేశాడు. అయితే దేవుడు తెలియజేసిన ధర్మములు ఈనాడు కూడా గ్రంథములరూపములో మనముందున్నా, ఆ గ్రంథములను మనిషి శ్రద్ధగా చూడడములేదు. ఒకవేళ ఎవరైనా దేవుని గ్రంథములను చూచినా, అందులో చెప్పిన ధర్మములను మనిషి శ్రద్ధా లోపము వలన అర్థము చేసుకోలేక పోవుచున్నాడు. సాధారణ మనుషులు

అర్థము చేసుకోలేక పోయినా ఆశ్చర్యము లేదుగానీ, మేము ఆధ్యాత్మికవేత్తల మనువారూ, మేము దేవుని జ్ఞానమును బోధించు బోధకులమనువారూ, పెద్ద స్వామీజీలుగా పేరుగాంచినవారూ దేవుడు చెప్పిన ధర్మములను వదలి, ధర్మములుగాని అధర్మములను ధర్మములుగా బోధించడము పూర్తి ఆశ్చర్యముగా ఉన్నది. గొప్ప బోధకులే కాకుండా దైవ గ్రంథములలో కూడా మనుషుల వ్రాతలు చేరడము వలన దేవుని ధర్మముల ముసుగులో అధర్మములు చేరిపోయి ధర్మములుగా చెప్పబడుచున్నవి. దేవుడు చెప్పిన ధర్మశాస్త్రమును వదలి, మనుషులు చెప్పిన, మనుషుల పేర్ల మీద గల ధర్మములను చెప్పడము జరుగుచున్నది.

ధర్మశాస్త్రమును మొదట దేవుడు భూమిమీదికి వచ్చునట్లు చేశాడు. దేవునికి తప్ప ధర్మశాస్త్రము ఎవరికీ తెలియదు. కావున దేవుడే మొదట ధర్మశాస్త్రమును చెప్పడము జరిగినది. ఎప్పటికైనా దేవుడు చెప్పినదే ధర్మ శాస్త్రమగును కానీ, మనుషులు చెప్పినది ధర్మశాస్త్రము కాదు. దేవుడు చెప్పిన ధర్మములను మనిషి చెప్పవచ్చునుగానీ, మనిషి స్వయముగా ధర్మములను చెప్పలేడు. ఇంకొక విశేషమేమంటే దేవుడు చెప్పిన ధర్మములు సంపూర్ణముగా ఉండును. అదే ధర్మములను మనిషి తిరిగి బోధగా చెప్పినా అవి అసంపూర్ణముగా ఉండును. తెలివైనవారు ఆ తేడాను కనిపెట్టవచ్చును. దేవునిచేత చెప్పబడిన ధర్మములు ప్రకాశవంతముగా ఉండును. వాటినే తిరిగి మనిషి చెప్పినా, అవి ప్రకాశవంతముగా కనిపించక తేజోహీనముగా కనిపించును. ఆ తేడాను అందరూ గమనించలేకపోవచ్చును. గత చరిత్రలో కొందరు ప్రవక్తల పేర్ల ప్రక్కన ధర్మశాస్త్రము అని వ్రాయబడినది. దానిని బట్టి అవి ఆ ప్రవక్తలు వ్రాసిన ధర్మశాస్త్రములని తెలిసిపోవుచున్నది. మనుషులు వ్రాసిన ధర్మశాస్త్రములను నమ్మకపోయినా, ప్రవక్తలు వ్రాసిన ధర్మశాస్త్రములను నమ్మవచ్చును కదా! అని కొందరడుగవచ్చును.

దేవుడు చెప్పిన ధర్మములనే మనిషి బోధ రూపములో చెప్పినా, అది లోపభూయిష్టముగా ఉండుటకు కారణము దేవుడు చెప్పినది చెప్పినట్లు మనిషికి అర్థముకాకపోవడమేనని చెప్పవచ్చును. ఒకవేళ ఉన్నది ఉన్నట్లు చెప్పుచున్నాననిపించినా, మనిషికి తెలియకుండానే దేవుని ధర్మములలో కొంత మార్పు చోటు చేసుకొని వాటి విలువలు వాటికి లేకుండా పోవును. ఈ విషయము అర్థమగుటకు ఒక ఉదాహరణను చెప్పెదను చూడండి. ఒక గురువు దేవుని జ్ఞానమును బోధించుచూ దేవుని సేవ చేసెడివాడు. అతను జ్ఞానమును బోధించడమే దేవుని సేవగా భావించి ధర్మబద్ధముగా సేవ చేయుచుండెను. అతని ఉద్దేశ్యములో బోధించడమే సేవ అయినందున, ఇతరులనుండి ఏ లాభమునూ ఆశించక దేవుని జ్ఞానమును బోధించెడివాడు. దేవుని జ్ఞానము యొక్క గౌరవమునకు భంగము కలుగకుండ ఉండునట్లు, దేవుని జ్ఞానమునకు గౌరవము చేకూరునట్లు, యుక్తాయుక్త, విచక్షణా జ్ఞానముతో పాత్రాపాత్ర దానము ప్రకారము ఇతరులకు జ్ఞానదానము చేయుచుండెను. జ్ఞానమునకు విలువ ఉండునట్లు తనవద్దకు వచ్చిన వారికి మాత్రమే జ్ఞానదానము చేసెడివాడు. జ్ఞానమును తెలుసుకోవాలని శ్రద్ధగల్గిన వారికి మాత్రమే జ్ఞానమును చెప్పెడివాడు. జ్ఞానమున్న చోటికే దానిని తెలుసుకోవాలనుకొన్నవాడు రావాలనీ, జ్ఞానము అతని వద్దకు పోకూడదనీ, తాను ఎక్కడికీ పోకుండా తన సమీపమునకు వచ్చిన వారికే అదియు పరిమిత సమయములోనే జ్ఞానమును బోధించెడివాడు. అలా కాకుండా గురువే శిష్యుల ఇళ్ళవద్దకు పోయి జ్ఞానము చెప్పడము మంచిది కాదు, అలా చెప్పడము వలన జ్ఞానమును అగౌరవపరచినట్లగునని చెప్పెడి వాడు.

ఒక పని చేస్తే అది సేవ అయినా కావచ్చును, కూలి అయినా కావచ్చును. దానిప్రకారము తాను చేయు జ్ఞానబోధ అను కార్యము కూలి వచ్చునదిగా ఉండకూడదు. ఆదాయము లేని సేవగా ఉండాలని భావించి

తాను చెప్పు బోధకు ప్రతిఫలితముగా ఇతరులనుండి ఏమీ ఆశించెడివాడు కాదు. ఇతరులు తమంతకు తాము ఏమైనా ఇవ్వదలచుకొన్నా అది దేవునికి ఉపయోగపడేదిగా ఉండాలని చెప్పెడివాడు. **"మీరు మాకు జ్ఞానమును చెప్పినందుకు మీకు డబ్బు ఇవ్వాలనుకొన్నాము అని అడిగితే, దానికి జవాబుగా మీరు ఇచ్చే ఒక్క రూపాయిగానీ దేవుని జ్ఞానము ప్రచార మగుటకు ప్రత్యక్షముగాగానీ, పరోక్షముగాగానీ ఉపయోగపడాలి. అట్లు దేవునికి కాకుండా మనిషి అయిన నాకు ఉపయోగపడకూడదని"** చెప్పేవాడు. ఆయన ఎవరినీ డబ్బు అడుగలేదు. ఎవరైనా ఇచ్చినా అది దేవుని జ్ఞాన ప్రచారములో వినియోగపడునట్లు చేసెడివాడు. ఇంకా ముఖ్యముగా సేవ విషయములో ఏమి చెప్పెడివాడంటే, వందరూపాయలు ఖర్చుపెట్టి దేవునికి పూజ చేయుటకంటే ఒక్క రూపాయి ఖర్చుపెట్టి దేవుని జ్ఞానమును ప్రచారము చేయమని చెప్పెడివాడు. అంతేకాక **"దేవునికి తనను పూజించడము ఇష్టము లేదనీ, తన జ్ఞానమును ప్రచారము చేయడమే ఆయనకు ఇష్టమనీ, అందువలన దేవుని జ్ఞానమును ప్రత్యక్షముగాగానీ, పరోక్షముగాగానీ ప్రచారము చేయుటలో పాలుపంచుకోవలెనని"** చెప్పెడివాడు.

దేవుని జ్ఞాన ప్రచారము చేయుటకంటే మించిన దైవ ఆరాధన లేదని చెప్పుచూ, అదే మనిషి అనుసరించవలసిన ముఖ్యమైన ధర్మమని చెప్పడమేకాక, తాను జ్ఞాన బోధయే ముఖ్యధర్మముగా తలచి, రాత్రిపూట గంట లేక రెండు గంటలకంటే ఎక్కువ విశ్రాంతి తీసుకోక, ఎక్కువ కాలము జ్ఞాన రచనలు చేయుచూ, కొంత గ్రంథరూపముగా, కొంత బోధరూపముగా దైవసేవ చేయుచుండెను. ఎవరైనా తాను అడుగకున్నా తాము కూడా సేవ చేయాలనుకొన్నామని, అరుదుగా ఎవరైనా డబ్బును ఇవ్వదలచుకుంటే దానిని దేవుని ఉండీలో (ఉందీలో) వేయించి, తర్వాత దేవుని జ్ఞాన ప్రచార సేవకు వినియోగించెడివాడు. తనకు దేవుని కార్యములు చేయుటలో డబ్బు

తక్కువవస్తే ఇతరులనుండి అప్పురూపముగా తీసుకొని దానికి తగిన వడ్డీ చెల్లించెడివాడు. ఈ విధముగా ఎంతో పద్ధతిగా మనిషి దైవ మార్గములో అనుసరించవలసిన ముఖ్య ధర్మము దైవజ్ఞానమును ఇతరులకు తెలియ జేయడమేనని తలచి, అదే పనిని ధర్మ విరుద్ధముగా కాకుండా చేయు చుండెను. తనకు తెలిసిన దేవుని జ్ఞానమును బోధించడమే మనిషికి ముఖ్య ధర్మమని చెప్పినందువలన ఆయనవద్ద జ్ఞానము తెలుసుకొన్న వారిలో ఇద్దరు తాము తమ గురువు ద్వారా తెలుసుకొన్న జ్ఞానమును ఇతరులకు చెప్పి దేవుని సేవ చేయాలనుకొన్నారు. అదే విషయమునే తమ గురువుగారి వద్ద అడిగి అనుమతి పొందాలనుకొన్నారు. వారి మాటలు విన్న గురువు సంతోషపడి ఒక భక్తుడుగా ఎవడైనా దేవుని సేవ చేయాలనుకుంటే, దేవుని జ్ఞానబోధ చేయడముకంటే మించిన సేవలేదని వారికి చెప్పి, వారిని ఆ పని తప్పక చేయమని ఉత్సాహపరిచాడు. తమ గురువు కూడా అనుమతి ఇవ్వడముతో వారు అప్పటినుండి దైవజ్ఞానమును బోధించను మొదలు పెట్టారు.

అలా వారు తాము తెలుసుకొన్న జ్ఞానమును బోధించను మొదలు పెట్టారు. తమ గురువు మాటల రూపములో చెప్పిన జ్ఞానమును, మాటల రూపములోనే కాకుండా పాటల రూపములోనూ, పద్యముల రూపములోను చెప్పుటకు మొదలుపెట్టారు. అప్పుడు గురువుగారు కేవలము మాటల రూపములో చెప్పిన జ్ఞానముకంటే పాటల, పద్యముల రూపములో చెప్పిన జ్ఞానము వినేవారికి బాగా కనిపించెను. అలా బాగా కనిపించుట వలన వినేవారు గురువుగారికంటే శిష్యులే బాగా చెప్పుచున్నారని వారిని పొగడను మొదలుపెట్టారు. దానితో ఇద్దరు శిష్యులూ తమనుతాము గొప్పగ భావించు కొనేదానికి మొదలుపెట్టారు. వినేవారు గురువుగారు చెప్పిన జ్ఞానమే కదా! వీరు చెప్పేది అని అనుకోకుండా వీరే స్వంతముగా గొప్పగ చెప్పినట్లు

పొగడగా, ఇద్దరు శిష్యులు కూడా ఇదంతయు గురువుగారు అందించుచున్న జ్ఞానమని అనుకోక, ప్రక్కవారు పొగిడేకొద్దీ తమను గొప్పగా ఊహించు కొనుటకు మొదలుపెట్టారు. మొదట మొదలు పెట్టినప్పుడు దైవ జ్ఞానమును బోధించుట ధర్మమే అయినా, అది గురువుగారివద్ద మాత్రము ధర్మముగా ఉంటూ, ఇద్దరు శిష్యుల వద్ద మాత్రము ధర్మము కాస్త అధర్మముగా మారను మొదలుపెట్టినది. అయినా జ్ఞానమును బోధించడము దేవుని సేవా ధర్మముగా ఇద్దరు శిష్యులు అనుకొనుచుండినా, వారికి తెలియకుండానే ధర్మము కొద్దికొద్దిగా మార్పు చెందుతూ వచ్చినది.

గురువుగారు దైవజ్ఞానమునకు విలువ చేకూర్చునట్లు తనవద్దకు వచ్చు వారికి మాత్రము జ్ఞానమును చెప్పెడివాడు. అయితే శిష్యులు వినేవారి వద్దకే పోయి చెప్పెడివారు. బోధించేది సేవా ధర్మమే అయినా వినేవారికి చౌకగా మారను ప్రారంభించినది. వచ్చిపోయే ఖర్చులకు డబ్బులిచ్చి నూతన వస్త్రములు, దక్షిణ ఇస్తే వారే వచ్చి చెప్పిపోతారను భావములోనికి వినేవారు వచ్చి, ఎప్పుడు అవకాశము వుంటే అప్పుడు జ్ఞానము చెప్పమని పిలిచెడి వారు. అప్పుడు వీరు జ్ఞానమును చెప్పడము ముఖ్య సేవా ధర్మము కదా! అని అక్కడికి పోయి చెప్పెడివారు. అయితే వారు ఇచ్చే దక్షిణ డబ్బులు, క్రొత్త గుడ్డలు, ఖర్చులు అన్నీ తమను గౌరవించడము కొరకే అని అనుకొనేవారు. అయితే ఈ విషయములు గురువుగారికి తెలియవు. ఇద్దరు శిష్యులు కూడా తమకు ఇచ్చు గౌరవ మర్యాదలనుగానీ, డబ్బుల విషయము గానీ గురువుగారికి తెలియకుండా ఉంచారు. ఒకవేళ గురువుగారికి తెలిస్తే జ్ఞానమునకు విలువ ఉండదనీ, జ్ఞానము యొక్క గౌరవమును తగ్గించినట్లగు నని అంటాడనీ తెలియకుండా ఉంచారు. ఈ విధముగా పీతల రుచి మరిగిన నక్క వరిమళ్ళ దారిపట్టినట్లు, లాభముల రుచి మరిగిన శిష్యులు ఎవరు పిలిస్తే వారివద్దకు పోయి జ్ఞానమును చెప్పుటకు తయారైనారు.

కొంతకాలమునకు పైనున్న గ్రహములలో ఒకటి వీరి ప్రవర్తన మీద నిఘా పెట్టినది. గురువుగారు ఎంతో గొప్పగ జ్ఞానమునకు విలువనిస్తూ పద్ధతిగా జ్ఞానమును బోధించుచుంటే, ఆయన శిష్యులు జ్ఞానమును ఊరూరికి పోయి అమ్మడము మంచిదికాదనీ, వారికి తగిన బుద్ధి చెప్పాలనుకొన్న గ్రహము సమయము కొరకు వేచి చూస్తుండెను. అలా ఉండగా ఒక శిష్యుడు అజ్ఞానముతో కొంత నోరు జారి మాట్లాడడము జరిగినది. బయట ప్రజలలో గురువుగారికంటే మాకే గౌరవము ఎక్కువగా ఉన్నది. మేము ఫలానా ఊరికి పోయివుంటే గురువుగారికంటే గొప్పగ మాకు మర్యాద ఇచ్చి, మంచిగా గౌరవించడమేకాక మంచి గుడ్డలు కూడా ఇచ్చారు. ఆయనకు రాని లాభము, ఆయనకు రాని గౌరవము మాకున్నదని ఇతరుల వద్ద తమను గురువుకంటే గొప్పగ చెప్పుకోవడము జరిగినది. అప్పుడు ముందుగానే వారిని గమనిస్తున్న గ్రహము, దేవుని సేవా ధర్మమును అధర్మముగా మార్చిన వారి మీద కోపము కల్గి, ఆ విధముగా మాట్లాడిన శిష్యున్ని ఏకంగా చంపివేయడము జరిగినది. దానిని చూచిన రెండవ శిష్యుడు బుద్ధి తెచ్చుకొంటాడని వదిలివేసినది.

కొంతకాలము జరుగగా గురువుగారివద్దకు వచ్చి జ్ఞానమును తెలుసుకొను మిగతా శిష్యులుకూడా తాము తమ ఊర్లలోనే ఉంటూ, తమవద్దకే వచ్చి చెప్పు తమ తోటిశిష్యున్ని తమవద్దకే రప్పించుకొని, జ్ఞానమును చెప్పించుకొనుటకు మొదలు పెట్టారు. అలా అలవాటుపడిన వారు ఇదంతయు తమ గురువు చెప్పిన జ్ఞానమే కదా! యని అనుకోక, అప్పుడు చెప్పిన శిష్యున్నే గురువుకంటే గొప్పగ పొగడడమూ, గౌరవించడమూ చేయనారంభించారు. ఇదంతయు గమనిస్తే జ్ఞానమును బోధించడము ముఖ్యమైన సేవా ధర్మముగా చెప్పుకొనినా, చివరకు అది సేవగా పైకి కనిపించినా, లోపల కూలిగా మారను మొదలుపెట్టినది. చేసిన పనికి ప్రతిఫలితమును పొందడము సేవ కాదు కూలియని తెలియకుండా మభ్యపెట్టి, తాము సక్రమముగా ఉన్నట్లే భ్రమింప చేసినది.

జ్ఞానమును బోధించు మంచి పనిని చేసినా, గురువుగారు జ్ఞానమును బోధించమని అనుమతి ఇచ్చినా, జ్ఞానమును బోధించడము దేవుని సేవలో ముఖ్య ధర్మము అయినా, గురువుగారు చెప్పినా, చేసినా, అది పూర్తి ధర్మముగా ఉండేది. అదే శిష్యుల వద్దకు వచ్చేటప్పటికి ధర్మము ధర్మముగా కాకుండా మరొకలాగ మారిపోయినది. సేవ పోయి కూలి అయినది. ఎవరైనా ఇచ్చిన ప్రతి దానినీ దేవుని సేవకై వినియోగించవలెనను సూత్రమును ప్రక్కన బెట్టి, తమ లాభము కొరకు, తమకు ఉపయోగపడుట కొరకు, జ్ఞానము చెప్పినందుకు ఇంత ఇవ్వవలెనని, ఇతరులను అడిగి ఇప్పించుకొను స్థితి రావడము వలన, ధర్మము గురువువద్ద ఒకలాగున శిష్యులవద్ద మరొక లాగున అమలగుచున్నదని అర్థమగుచున్నది. ఇదే విధముగానే దేవుడు తెలిపినపుడు ధర్మము సంపూర్ణముగా ఉండినా, దానినే మనుషులు తెలిపినా, కొంత లోపముతో ఉండును. అందువలన దేవుని జ్ఞానమును దేవుడే తెలుపవలసియున్నది. దేవుడు తెలిపినప్పుడే అది గౌరవప్రదమై సంపూర్ణత కల్గియుండును. దేవుడు తెల్పిన తర్వాత దానినే మనిషి నేర్చుకొని చెప్పినా దానిలో కొంత లోపమేర్పడి, సంపూర్ణ గౌరవ ప్రదముకానిదై వుండును. మనిషిలోని మాయ అలా చేసి, దేవుని ధర్మములను దేవుడు తప్ప ఇతరులు తెలుపలేరన్నట్లు చేయుచున్నది.

పై ఉదాహరణనుబట్టి దేవుని ధర్మములు ఏవైనా దేవుడు తెలుపవలసిందేగానీ, మనుషులు తెలుపలేరనీ, తెలిపినా దారితప్పియుండుననీ తెలియుచున్నది. దేవుడు స్వయముగా భగవంతుని అవతారముగావచ్చి భగవద్గీతను తెలియజేశాడు. దేవుడు తెలిపినది కావున భగవద్గీతయంతా దైవ ధర్మములే ఉన్నాయి. అయితే అవి మనిషి తలలోనికి వచ్చేటప్పటికి వాటిలోని విలువలు మారిపోయి, దేవుడు చెప్పినట్లు కాకుండా, మరొక రకముగా మారిపోయినవి. అందువలన భగవద్గీత మనుషులలో ఇప్పటి వరకూ ఏకాభిప్రాయమును సంపాదించలేదు. దేవుడు చెప్పినది ఒకే

విధమైతే, మనుషులు దానిని అనేక విధములుగా అర్థము చేసుకొన్నారు. దీనినిబట్టి దేవుడు చెప్పినదే ధర్మముగానీ, మనిషి చెప్పినది ధర్మము కాదు అని ధైర్యముగా చెప్పవచ్చును. ఎక్కడైనా ధర్మము ముందర మనుషుల పేర్లు ఉండినా, మను ధర్మశాస్త్రము, ప్రవక్తయైన మోషే ధర్మశాస్త్రము, యెషయా ధర్మశాస్త్రము అని కొన్ని గ్రంథములో చెప్పినట్లు ఎక్కడైనా మనుషుల పేర్లతో ధర్మశాస్త్రము ఉండినా, వాస్తవముగా అది ధర్మశాస్త్రము కాదు. దేవుడు తప్ప మనుషులు ఎవరూ ధర్మశాస్త్రమును చెప్పలేరు. మనుషులు చెప్పినది ధర్మశాస్త్రము కాదు అని నేనంటే కొందరు ఆశ్చర్యముగా నన్ను చూచి ఈ విధముగా ప్రశ్నింతురు. ప్రశ్నకు తగినట్లు మా జవాబులుండును చూడండి.

**ప్రశ్న :-** బైబిలు గ్రంథములోని మోషే ధర్మశాస్త్రమును, యెషయా ధర్మ శాస్త్రమును మోషే ప్రవక్త, యెషయా ప్రవక్త వ్రాశారని కలదు. అటువంటి ప్రవక్తలు వ్రాసినవి ధర్మశాస్త్రములు కావా?

**జవాబు :-** మోషే ప్రవక్తగానీ, యెషయా ప్రవక్తగానీ ఇరువురూ సాధారణ మనుషులే అయినందున, వారు వ్రాసినవి ధర్మశాస్త్రములు కావని చెప్పవచ్చును. దేవుడు తప్ప మనుషులు ఎవరూ ధర్మశాస్త్రమును చెప్పలేరు.

**ప్రశ్న :-** ప్రవక్త అయిన ఏసు చెప్పిన బైబిలును మీరు ధర్మశాస్త్రమని ఒక సందర్భములో చెప్పియున్నారు. ప్రవక్త అయిన ఏసు కూడా మనిషే కదా! అలాంటప్పుడు ఏసు చెప్పినది ధర్మశాస్త్రమైనప్పుడు ప్రవక్తలైన మోషే, యెషయా చెప్పినది ధర్మశాస్త్రము ఎందుకు కాదు?

**జవాబు :-** ఏసు ప్రవక్త అయినా మనిషికాదు. ఏసు మనిషివలెనున్న భగవంతుడు. సాక్షాత్తు దేవుని అవతారమే ఏసు. అందువలన ఏసు చెప్పినది ధర్మశాస్త్రమని చెప్పాము. ప్రవక్త అనునతడు సామాన్య మనిషి అయినా కావచ్చు, లేక భగవంతుడైనా కావచ్చు. ప్రవక్తలైనంత మాత్రమున

అందరూ భగవంతులూ కారు. అట్లే అందరూ సామాన్య మనుషులూ కారు.

**ప్రశ్న :-** దేవుని గురించి వ్రాయబడినది ఏదైనా ధర్మశాస్త్రమే అయినప్పుడు, ఏసును మీరు భగవంతుడు అన్నప్పుడు, అదే ఏసు నన్ను గురించి మోషే వ్రాసియున్నాడు అని బైబిలులో యోహాను సువార్త ఐదవ అధ్యాయమునందు 46వ వచనమున చెప్పియున్నాడు. అయనను గురించి వ్రాసినది ధర్మశాస్త్రము కాదంటారా?

**జవాబు :-** ఏసు దేవుని అవతారమైన భగవంతుడైనా, ఆయనను గురించి మోషే వ్రాసియున్నా అది ధర్మశాస్త్రము కాదు. ఎందుకనగా మోషే ఏసును గురించి వ్రాసినా, అందులో ధర్మములను గురించి వ్రాయలేదు. ఏసు జీవిత చరిత్రను గురించి వ్రాశాడు. అందువలన అది జ్యోతిష్యశాస్త్రమవుతుందిగానీ, ధర్మశాస్త్రము కాదు. దేవుని ధర్మములు కలదే ధర్మశాస్త్రము అని అనవచ్చును లేక బ్రహ్మవిద్యాశాస్త్రము అనవచ్చును. భూమిమీద షట్ శాస్త్రములే గలవు. ఆరుశాస్త్రములలో పెద్దది బ్రహ్మవిద్యాశాస్త్రము లేక ధర్మశాస్త్రము అంటాము. ధర్మశాస్త్రము మిగతా ఐదు శాస్త్రములైన గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్యశాస్త్రములకంటే గొప్పది. మోషే చెప్పినది ఏసు యెడల జరుగబోవు సంఘటనలు, కావున దానిని జ్యోతిష్య శాస్త్రమనవచ్చునుగానీ, ధర్మశాస్త్రము అనకూడదు. ధర్మశాస్త్రములో దేవుని విధానములు ఉంటాయి. ధర్మశాస్త్రమును దేవుడే చెప్పును, మనుషులు చెప్పరు. ఏసు కూడ **"దేవుడు చెప్పిన ధర్మశాస్త్రము ప్రకారము నేను నడుచుటకు వచ్చానుగానీ, మనుషులు చెప్పినట్లు నడుచుటకు రాలేదు"** అనునట్లు మోషే చెప్పినది ధర్మశాస్త్రము కాదు, మోషేకు అది అనుగ్రహించ బడలేదు అని యోహాను సువార్త, ఆరవ అధ్యాయమునందు 32, 33 వచనములలో ఇలా కలదు. **"(32) పరలోకమునుండి వచ్చు ఆహారము**

**మోషే మీకియ్యలేదు. నా తండ్రియే పరలోకమునుండి వచ్చు నిజమైన ఆహారమును మీకనుగ్రహించుచున్నాడు. (33) పరలోకమునుండి దిగివచ్చి లోకమునకు జీవమునిచ్చునది దేవుడనుగ్రహించు ఆహారమైయున్నదని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను."** ఇక్కడ చెప్పిన ఈ వాక్యములో కొన్ని పదములు అర్థము కాకపోవచ్చును. అందువలన వాటి వివరమును చెప్పదలచుకొన్నాను. పరలోకమునుండి దిగివచ్చు ఆహారము అను వాక్యమునకు వివరమును చెప్పుకుంటే, పరలోకమునుండి అనగా దేవుని వద్దనుండి అని అర్థము. దిగివచ్చిన ఆహారము అనగా జ్ఞానరూపముగా యున్న దేవుని ధర్మములని తెలియవలెను. దేవుని ధర్మములు మోషే మీకు ఇయ్యలేదని పై వాక్యములో కలదు. కావున మోషే వ్రాసినది ధర్మ శాస్త్రము కాదు అని స్వయముగా ఏసే చెప్పినట్లయినది. ముప్పై మూడవ వాక్యములో దేవుడనుగ్రహించు ఆహారము లోకమునకు జీవమునిచ్చునదై యున్నదని చెప్పడమైనది. దీని అర్థము దేవుడు తెలిపిన ధర్మములు లోకములోని మనుషులకు మోక్షము నిచ్చునవైయున్నవని తెల్పుచున్నది. ఇక్కడ లోకమునకు జీవము నిచ్చునది అంటే జీవము అను పదమునకు శాశ్వతముగా ఉండు లేక శాశ్వతముగా జీవించు మోక్షమని తెలియవలెను. జీవించు అను పదము మోక్షమును గురించి వాడినదని తెలియవలెను. ఈ రెండు వాక్యములలో మోక్షమునిచ్చు ధర్మములను మోషే చెప్పలేదు. ధర్మములను దేవుడే చెప్పాడు. దేవుడు చెప్పిన ధర్మముల వలన మనుషులకు శాశ్వతమైన, నాశరహితమైన మోక్షము లభించగలదు అని గలదు.

పై విషయము మోషే చెప్పినది ధర్మశాస్త్రము కాదు అనుటకు సాక్ష్యముగా ఉన్నది. అయితే ఇంతవరకు మోషే చెప్పినది ధర్మశాస్త్రమని కొందరనినా, లేక అందరనినా అది సత్యముకాదనీ, మోషే చెప్పినది జ్యోతిష్య శాస్త్రమనీ, ధర్మశాస్త్రమును దేవుడు తప్ప ఎవరూ చెప్పలేరని తెలియుచున్నది.

**ప్రశ్న :-**మోషే ప్రవక్తయైనా మనిషి అయినందున ఆయన చెప్పినది ధర్మశాస్త్రము కాదని చెప్పుచున్నారు కదా! అలాంటప్పుడు భగవద్గీతను, బైబిలును చెప్పినది భగవంతుడైనా, తర్వాత వ్రాసినది మనుషులే కదా! అలాంటపుడు మనుషులు వ్రాసిన దానిని దైవగ్రంథము అంటున్నాము కదా! దైవగ్రంథము అంటే ధర్మశాస్త్రమే కదా! ఇక్కడ మనుషులు వ్రాసినది ధర్మశాస్త్రమైనప్పుడు అక్కడ ప్రవక్తయైన మోషే వ్రాసినది ధర్మశాస్త్రమని కొందరనడము తప్పా?

**జవాబు :-** ఈ ప్రశ్న యోహాను సువార్త, ఆరవ అధ్యాయములో 32, 33 వాక్యములను గుర్తు చేయకముందు అడుగవలసినది. ఆ రెండు వాక్యము లను చెప్పిన తర్వాత మోషే మీకు ధర్మశాస్త్రమును చెప్పలేదు అని ఏసే చెప్పిన తర్వాత ఈ ప్రశ్న అడుగడములో అర్థములేదు. రామాయణ మంతయు విన్న తర్వాత కూడా రామునికి సీత భార్య అయితే రావణునికి ఏమౌతుంది? అని అడిగినట్లున్నది. అయినా మేము చెప్పునది ఏమనగా! ఇతరులకు సీత ఏమైన కావచ్చును గానీ భార్యకాదని రామునికి ఒక్కనికే భార్యయని చెప్పినట్లు ధర్మశాస్త్రమును చెప్పువాడు దేవుడు ఒక్కడేయని, మిగతావారు చెప్పినవి ఏ శాస్త్రమైనా కావచ్చును గానీ, ధర్మశాస్త్రము కాదని చెప్పుచున్నాము. ధర్మశాస్త్రమును దేవుడు తప్ప ఇతరులు ఎవరూ చెప్పలేరు. దేవుడు చెప్పిన దానినే మనిషి వ్రాసినా, అది దేవుడు చెప్పినట్లేగానీ మనుషులు చెప్పినట్లు కాదు.

**ప్రశ్న :-** దైవ గ్రంథములైన ధర్మశాస్త్రములు కూడా కొంత కాలుష్యమునకు గురియైనాయని మీరు గతములో చెప్పారు కదా!

**జవాబు :-** అవును గతములోనే కాదు ఇప్పుడు కూడా "ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత" అను గ్రంథములో అదేమాటను వ్రాశాము.

మొదట దేవుడు చెప్పినప్పుడు అది స్వచ్ఛమైన ధర్మశాస్త్రమైనా మనిషి జోక్యము వలన ధర్మశాస్త్రములో కూడా కొంత కాలుష్యము చేరినదని చెప్పాము. చెప్పడమేకాక ఆ కాలుష్యము ఎట్లున్నదో, ఎక్కడున్నదో చూపించి, దానిని తీసివేసి కాలుష్యము లేని పరమ, పవిత్ర, పరిశుద్ధ గ్రంథముగా భగవద్గీతను చూపడము జరిగినది. బైబిలు, ఖుర్ఆన్ అను పేర్లతోయున్నవి కూడా దైవ గ్రంథములేనని, వాటిలోని మనుషుల కాలుష్యమును వేలెత్తి చూపుచూ, అవి కూడా పరిశుద్ధ, పవిత్ర గ్రంథములుగా యుండునట్లు ప్రయత్నించుచున్నాము.

**ప్రశ్న :-**దేవుడు చెప్పినవి దైవ గ్రంథములు, వాటినే ధర్మశాస్త్రము అంటాము. దేవుడు చెప్పినది దేవునికే తెలుసునను సూత్రము ప్రకారము ఆ గ్రంథము లలో ఏది సత్యమో, ఏది అసత్యమో దేవునికే తెలుసు. అలాంటప్పుడు ఇది నేను చెప్పిన జ్ఞానము కాదు, మనుషులు చెప్పినది. ఇది ధర్మము, ఇది ధర్మము కాదు అని దేవుడు చెప్పి, గ్రంథములలో కలిసిన కాలుష్యమును చూపవచ్చును. అయితే ఒక మనిషి అయిన మీరు ఇది ధర్మము, ఇది ధర్మముకాదు అని వాటిలోని కాలుష్యమును ఎలా చూపగలరు? మీకు ఎలా తెలియును?

**జవాబు :-** మంచి ప్రశ్న అడిగారు. ఇదే విషయమును నేనే "ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత" అను గ్రంథములో వివరించి చెప్పాను. మొదట భూమిమీద దేవుడు తన జ్ఞానమును మూడు విధములుగా ప్రవేశింపజేశాడు. ఇప్పుడు అందులోని తప్పులను ఒక విధముగా సరి చేయుచున్నాడు. ఒక మనిషిలోని ఆత్మ మనిషి చేత ధర్మశాస్త్రములో కలిసిపోయిన తప్పులను చూపించి, బయట మనుషులందరికీ తన శాస్త్రములోని తప్పులను తానే బయటపెట్టునట్లు చేశాడు. **ఆకాశవాణి చేత, తెరవెనుకనున్న గ్రహము చేత, మనిషి అయిన భగవంతుడు చేత** మూడు విధముల తన ధర్మములను

చెప్పించిన దేవుడు, మనిషిలోని ఆత్మే మనిషిచేత తన శాస్త్రములోని కలుషిత తప్పులను బయటపడునట్లు చేయును అను మరియొక విధానమును దేవుడు భూమిమీద ఆవిర్భవింపజేసి, కలిసిన తప్పులను తీసివేయడము కూడా జరుగుచున్నది. దేవుడు మూడు విధముల తన ధర్మములను శాస్త్రముగా బోధించి, ఒక విధముగా తప్పులను సరిచేయు పద్ధతిని కూడా ఏర్పరచాడు. ఇక్కడ మొత్తము నాలుగు విధానములలో మూడు విధానములు బోధించడము, ఒక విధానము కలిసిన తప్పులను తీసివేసి శుద్ధి చేయడము. ఒక ఇల్లును కట్టిన తర్వాత ఆ ఇంటిని శుభ్రము చేయు బాధ్యత కూడా ఇంటి యజమానిదే అన్నట్లు, ధర్మశాస్త్రమను ఇల్లును నిర్మించిన దేవుడు అప్పుడప్పుడు ఆ ఇంటిలో పడిన చెత్తను తీసివేసి శుభ్రము చేయు బాధ్యతను కూడా కల్గియున్నాడు. అందువలన మూడు విధముల తన ధర్మములను నెలకొల్పినవాడు, ఒక విధానము ప్రకారము దానిలోనికి చేరిన కాలుష్యమును కూడా తీసివేయును. మూడు విధములకంటే వేరుగానున్న మరొక విధానమును అనుసరించి ధర్మముల మీద వున్న దుమ్మును దులిపి, వాటిని ప్రకాశవంతము చేయునని తెల్పుచున్నాము. ఆ విధానమును ఏదో ఒక మనిషి ద్వారా చేయవలసియున్నది. కావున ఇప్పుడు అలాగే చేశాడని ఎందుకు అనుకోకూడదు?

**ప్రశ్న :-** మీరు చెప్పిన దానిప్రకారము మూడు విధానములయందు చివరి మూడవ విధానములో మనిషి అయిన భగవంతుడు ధర్మములను తెలియ జేశాడు. ధర్మములలోని కలుషితమును తీసివేసి శుభ్రము చేయుటకు మనిషి మాత్రమే ఉపయోగపడునా? లేక మనిషివలెనున్న భగవంతుడు ఆ పనిని చేయునా?

**జవాబు :-** మనిషివలెనున్న భగవంతుడు అని అంటే భగవంతుడు రెండు విధములుగా పని చేసినట్లగును. అప్పుడు దేవుడు చెప్పిన మాటకు

విరుద్ధముగా భగవంతుడు మూడవ విధానమే కాకుండా, నాల్గవ విధానమును కూడా చేసినట్లగును. అట్లు కాకుండా భగవంతుడు మూడవ విధానము ప్రకారము జ్ఞానమును చెప్పగా, నాల్గవ విధానము ప్రకారము మనిషిలోని ఆత్మ చేయుచున్నదని చెప్పుచున్నాము. మూడవ విధానములో పరమాత్మే ఆత్మవలె పని చేయుచున్నది. నాల్గవ విధానములో ఆత్మే పరమాత్మవలె పని చేయుచున్నది. అయితే పరమాత్మ ఆత్మ రెండూ శరీరములోపల కనిపించక ఉండునవి. కావున ఎక్కడ పరమాత్మ ఆత్మవలె చెప్పుచున్నదో, ఎక్కడ ఆత్మ పరమాత్మవలె చెప్పుచున్నదో, ఎవరు చెప్పునది మూడవ విధానమో, ఎవరు చెప్పునది నాల్గవ విధానమో, ఎవరు భగవంతుడుగా యున్న మనిషో, ఎవడు మనిషిగాయున్న భగవంతుడో ఎవరికీ అర్థము కాదు.

**ప్రశ్న :-** నాల్గవ విధానమును చెప్పువాడు మనిషా, భగవంతుడా? ఏమీ అర్థము కాకుండా చెప్పారు. నిజముగా ఎవరో చెప్పండి?

**జవాబు :-** ముందు భూమిమీద ఎక్కడ మూడవ విధానము ప్రకారము జ్ఞానబోధ జరుగుచున్నదో. ఎక్కడ నాల్గవ విధానము ప్రకారము ధర్మములు ప్రక్షాళనము చేయబడుచున్నవో చెప్పండి, అప్పుడు అక్కడ చెప్పినది ఎవరైనదీ చూచి చెప్పగలను.

**ప్రశ్న :-** భగవద్గీతలో ధర్మములకు గ్లాని ఏర్పడినప్పుడు నేను వచ్చి తిరిగి ధర్మములేవో తెలుపగలనన్నాడు. అప్పుడు క్రొత్తగా ధర్మములను తెలియ జేయుటకు వచ్చినట్లా లేక ముందే వున్న ధర్మములను శుభ్రము చేసి చూపినట్లా?

**జవాబు :-** ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున తొమ్మిదవ శ్లోకమందు **"నేను ఎక్కడ పుట్టానో, ఏమి చేయు చున్నానో అటువంటి నా జన్మనుగానీ, నా పనినిగానీ తెలియగలిగిన మనిషి**

**చనిపోయిన తర్వాత మరల జన్మకు పోడు. అటువంటి వాడు నాలోనికి ఐక్యమైపోవును"** అని అన్నాడు.

*శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః ।*
*త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున! ॥*

ఇదంతయు గమనిస్తే మొదటి విధానమైన ఆకాశవాణినిగానీ, రెండవ విధానమైన గ్రహమునుగానీ తెలియవచ్చునుగానీ, మూడు నాలుగు విధానములలో ఏది మూడవదో, ఏది నాల్గవదో చెప్పలేము. అందువలన దేవుడు కూడా మూడవ విధానము వరకు చెప్పి వదలివేశాడు.

**ప్రశ్న :-** దేవుడే చెప్పకుండ వదిలివేసినప్పుడు నాల్గవ విధానమును గురించి నీవు ఎలా చెప్పగలుగుచున్నావు?

**జవాబు :-** నాల్గవ విధానమును ఏ మనిషీ కనుగొనలేదు, చెప్పలేదు అని నేను ముందే చెప్పాను. అందువలన నాల్గవ విధానమును గురించి నాకు కూడా ఏమీ తెలియదు. అయితే నాలోని ఆత్మకు తెలుసు, కావున పరమాత్మ అయిన దేవుడు శరీరమునకు అధిపతిగానున్న ఆత్మచేత చెప్పించాడు. ఆత్మ చెప్పగలదు గానీ, జీవాత్మనైన నాకు తెలియదనియే చెప్పుచున్నాను.

ప్రశ్న :- నీకు తెలియకుండా నీ ఆత్మకు ఎలా తెలిసింది?

**జవాబు :-** ముందే చెప్పాను కదా! నాకు పరమాత్మతో సంబంధము లేదు. పరమాత్మతో ఆత్మకే సంబంధముండును. అందువలన పరమాత్మ తెలిపిన విషయమునే ఆత్మ నా శరీరముచేత చెప్పించినది. అంతమాత్రమున నేను చెప్పినట్లు కాదు కదా!

**ప్రశ్న :-** ఇదేదో పెద్ద తిరకాసుగా వుంది. ఏదీ అర్థము కాకుండా చెప్పు చున్నావు.

**జవాబు :-** నాకు అర్థము కాలేదనే నేను చెప్పుచున్నాను. ఎవరికీ అర్థము కాకూడదనే దేవుడు అట్లు చెప్పాడు.

**ప్రశ్న :-** దేవుడు ఎవరికీ అర్థము కాకూడదని ఎందుకు అనుకుంటున్నాడు?

**జవాబు :-** ఆయన జన్మగానీ, ఆయన పనిగానీ ఎవనికైనా అర్థమయితే వానికి సులభముగా మోక్షము లభించును. ఎంతో జ్ఞానమును తెలిసి యోగమును ఆచరిస్తే గానీ దొరకని మోక్షము సులభముగా దొరకడము దేవునికి ఇష్టము లేదు. అందువలన తననూ తన జన్మనూ, తన కర్మనూ మనిషి జ్ఞానము, యోగము ద్వారా తెలియవలెనని అట్లు కాకుండా సులభముగా తెలియకూడదని ఆయన భూమిమీద అమలు పరుచు మూడవ విధానమునుగానీ, నాల్గవ విధానమునుగానీ ఎవరికీ అర్థము కాకుండా చేశాడు.

**ప్రశ్న :-** అంతిమ దైవ గ్రంథమైన ఖుర్‌ఆన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌నందు దేవుడు మూడు విధములుగా తన ధర్మములను జ్ఞాన రూపముగా తెలియజేయును అన్నాడు. అందువలన అది బ్రహ్మావిద్యా శాస్త్రము ప్రకారము చెప్పినదని తెలియుచున్నది. అయితే నీవు చెప్పిన నాల్గవ విధానమునకు ఎక్కడైనా శాస్త్రబద్ధత ఉన్నదా? దైవ గ్రంథములలో ఎక్కడైనా నాల్గవ విధానమునకు సంబంధించినది ఉన్నట్లు దేవుడు చెప్పాడా?

**జవాబు :-** ఎందుకు చెప్పలేదు? శాస్త్రబద్ధత లేకుండా ఆయన విధానము ఏదీ ఉండదు. భగవద్గీతలో జ్ఞాన యోగమున ఏడవ శ్లోకమును చూడండి.

*శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।*
*అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥*

ఈ శ్లోకములో భావము ఇలా కలదు. **“తాను ముందే చెప్పియున్న ధర్మములకు గ్లాని అను కొంత కాలుష్యము ఏర్పడినప్పుడు నేను పుట్టివచ్చి (మనిషిగా వచ్చి) అధర్మములైన కలుషితమును తీసివేసి, ధర్మములకు ఆటంకము లేకుండా ప్రకాశవంతము చేయుచున్నాను”** అని అన్నప్పుడు

ఉన్న ధర్మములకు ఏర్పడిన గ్లానిని లేకుండా చేయడము వాటిలోని కాలుష్యమును తీసివేసినట్లు అవుచున్నది కదా! అందువలన ఈ శ్లోకము నాల్గవ విధానమునకు ఆధారము కాదా!

**ప్రశ్న :-** ఈ శ్లోకము నాల్గవ విధానమునకు సంబంధించినదైతే మూడవ విధానమునకే శాస్త్రాధారము లేకుండా పోవును కదా! ఇంతవరకు దేవుడు వచ్చి భూమిమీద జ్ఞానమును తెలియజేయుననుటకు ఆ శ్లోకము ఆధారము అనుకొనియుంటిమి. ఇప్పుడు మూడవ విధానమునకు శాస్త్రాధారము ఏమి ఉన్నది?

**జవాబు :-** ఉన్న ధర్మములకు కాలుష్యము ఏర్పడితే గ్లాని అను కాలుష్యమును తీసివేయుటకు వస్తానని ఆధారమును చూపుచూ జ్ఞానయోగములోని ఏడవ శ్లోకమును చెప్పాడు. పూర్తి తెలియకుండా పోయిన ధర్మములను తిరిగి తెలుపుటకు ధర్మములను క్రొత్తగా సంస్థాపన చేయుటకు మూడవ విధానముగా వస్తానని జ్ఞానయోగములోనే ఎనిమిదవ శ్లోకములోనే చెప్పాడు చూడండి.

(దేహములో గ్లాని ఏర్పడడము జరుగుచుండును. పని చేసినపుడు శరీరములో తయారైన కాలుష్యము వలన కొంత బలహీనము ఏర్పడడమును గ్లాని అంటాము. శరీరములో ఉన్న బలము కొంత తగ్గడమును గ్లాని అంటాము. శరీరములోని కాలుష్యము చెమట రూపములో, మూత్రము రూపములో, శ్వాసరూపములో బయటికి పోవును. గ్లాని ఏర్పడి అలసట చెందిన మనిషి కొంత విశ్రాంతిని పొందితే తిరిగి శరీరము బలమును చేకూర్చుకొనును. ఉన్న బలములో కొంత గ్లాని ద్వారా తగ్గిపోయినా, విశ్రాంతితో తిరిగి పూర్తి బలము చేకూరును. అట్లే ఉన్న ధర్మములు బయటి మనుషులు చేసిన కాలుష్యము వలన కొంత బలహీనముగా మారినా, కొంత విశ్రాంతిని పొందడము వలన, అనగా జ్ఞానబోధ అను విశ్రాంతిని

పొందడము వలన, బలహీనత అను ధర్మముల గ్లాని తొలగి పోవును. ఉన్న బలము కొంత తగ్గడమును గ్లాని అను పదముతో చెప్పారు. పూర్తి లేకుండా పోవడముకాక కొంత తగ్గినప్పుడు మాత్రమే గ్లాని అను పదమును ఉపయోగించడము జరుగుచున్నదని తెలియవలెను.

**స్థాపించడము అంటే పూర్తి లేని దానిని నెలకొల్పడము అని అర్థము. లేని దానిని నిర్మించడమును స్థాపించడము అంటాము.** బయట ప్రపంచములో రాజకీయ పార్టీలు మొత్తము పది ఉన్నాయనుకోండి. కొంత కాలమునకు లేని క్రొత్త పార్టీ పదకొండవది తయారయిందనుకొందాము. అప్పుడు ఆ పార్టీని ఫలానా నాయకుడు స్థాపించాడు అని అంటాము. ఇక్కడ స్థాపించడము అని అంటే లేని దానిని క్రొత్తగా నిర్మించడము అని అర్థము. ఎనిమిదవ శ్లోకమున ధర్మసంస్థాపన అను పదమును ఉపయోగించారు కావున లేని ధర్మములను సృష్ఠించడము అని ఇక్కడ అర్థము చేసుకోవలెను. ఏడవ శ్లోకమున గ్లాని అను పదమును ఉపయోగించారు, కాబట్టి ఉన్న ధర్మములు బలహీనమైనప్పుడు చెప్పిన పదముగా గుర్తించవలెను. దీనినిబట్టి ఏడవ శ్లోకమున ధర్మములకు కొంత బలహీనత ఏర్పడినప్పుడు అధర్మములను బలహీనతను దేవుడు తీసివేయును అని తెలియుచున్నది. ఎనిమిదవ శ్లోకమున ధర్మములు పూర్తి లేకుండా పోయినప్పుడు తిరిగి వాటిని క్రొత్తగా బోధించి స్థాపించునని తెలియుచున్నదని గ్రహించవలెను.)

*శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।*
*ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥*

**భావము :-** "చెడు జనులను లేకుండా చేయుటకు, మంచి జనులుగా మార్చుటకు యుగయుగములోనూ పుట్టుచున్నాను. పుట్టి పూర్తిగా లేకుండా పోయిన ధర్మములను తిరిగి నెలకొల్పి, చెడు జనులను (అజ్ఞానులను)

జ్ఞానులుగా మారునట్లు చేయుచున్నాను" అని అన్నాడు. ఇక్కడ ఇదే అధ్యాయములో ఒకటి, రెండు, మూడు శ్లోకములందు మొదట సూర్యునికి చెప్పిన జ్ఞానము సూర్యుని ద్వారా ప్రపంచమంతా ప్రాకి అందరికీ తెలిసి పోయినది. అలా అందరికి తెలిసిన జ్ఞానము పూర్తిగా భూమిమీద ఎవరికీ తెలియకుండా పోయినది. అట్లు తెలియకుండాపోయిన రహస్యమైన జ్ఞానమును నీకు నేను చెప్పుచున్నాను జాగ్రత్తగా విను అని చెప్పడము జరిగినది. అలా పూర్తి లేకుండా పోయినప్పుడు నేను పుట్టి తిరిగి నా ధర్మములను తెలియ చేస్తాను అని ఎనిమిదవ శ్లోకములో చెప్పాడు. ఏడవ శ్లోకమున ఉన్న ధర్మములలో గ్లాని అను కాలుష్యమేర్పడినప్పుడు దానిని తీసివేయుటకు వస్తానని చెప్పాడు. అందువలన బాగా గమనించితే ఏడవ శ్లోకము నాల్గవ విధానమునకు, ఎనిమిదవ శ్లోకము మూడవ విధానమునకు ఆధారములుగా ఉన్నవని చెప్పవచ్చును.

**ప్రశ్న :-** భగవద్గీతలోని ఏడవ శ్లోకము కాలుష్యమును తీసివేయు నాల్గవ విధానమనిగానీ, ఎనిమిదవ శ్లోకము పూర్తిగా లేకుండా పోయిన ధర్మములను తెలియజేయు మూడవ విధానమనిగానీ, ఇంతవరకు భగవద్గీతకు వివరము చెప్పినవారు ఎవరూ చెప్పలేరు. భగవద్గీతలోని చిన్న పదమునకు కూడా అర్థము చెప్పిన స్వామీజీలు ఎందరో కలరు. వారు మీరు చెప్పినట్లు ఏడవ శ్లోకములో ఇట్లున్నదనీ, ఎనిమిదవ శ్లోకము ఈ విధముగా ఉన్నదనిగానీ ఎందుకు చెప్పలేదు?

**జవాబు :-** ఎందుకు చెప్పలేదో వారినే అడుగవలసివుంటుంది. నేను చెప్పిన విధానములు సత్యమైనవో కాదో చూచుకోండి. నేను చెప్పినట్లు మీకు కనిపించినా నాకు చెప్పినవాడు ఆత్మేననీ, ఆత్మే నా ద్వారా చెప్పించినదనీ ముందే చెప్పాను. వాస్తవముగా చెప్పితే దేవుడు మూడు విధములుగా తన ధర్మములను తెలియజేస్తాడని మూడవ దైవ గ్రంథమైన

ఖుర్‌ఆన్‌లో చెప్పాడు గానీ, భగవద్గీతలో చెప్పలేదు. భగవద్గీతలో ఖుర్‌ఆన్‌లో చెప్పినట్లు మూడు విధానములు కలవు. అయితే గీతలోయున్న మూడు విధానములను ఎవరూ గుర్తించలేకపోయారు. ఎవరూ గుర్తించకపోతే చెప్పి కూడా ప్రయోజన ముండదు. కావున ఏదో ఒక మనిషిలోని ఆత్మ ద్వారా ఆ విధానములను దేవుడే చెప్పించాడు. అటువంటి అవకాశము నా శరీరములో నా ఆత్మచేత జరిగినది, కావున మిగతా వారికి ఎవరికీ తెలియని సమాచారము నాకు తెలిసినది.

**ప్రశ్న :–** ఇప్పుడు ఒక ముఖ్యమైన ప్రశ్నను అడుగుచున్నాము. ఈ ప్రశ్నకు జవాబును మాకు అర్థమగునట్లు చెప్పమంటున్నాము. కృష్ణుడు చెప్పిన భగవద్గీతలోనే జ్ఞానయోగమున ఏడు, ఎనిమిది శ్లోకములలో మూడవ విధానమూ, నాల్గవ విధానమూ కలదని మీరు చెప్పారు. కృష్ణుడు భగవంతునిగా వచ్చిన రోజు మూడవ విధానమైన లేని ధర్మములను తెలియజేయను వచ్చాడా? లేక నాల్గవ విధానమైన ఉన్న ధర్మములలోని కాలుష్యమును తీసివేయను వచ్చాడా?

**జవాబు :–** భగవంతుడు భూమిమీదికి వచ్చినా, ఎవరూ ఆయనను గుర్తించ లేరని ముందే చెప్పుకొన్నాము. అందువలన **కృష్ణుడు భూమిమీద ఉన్నప్పుడు ఆయన భగవంతుడని ఒక్క భీష్మునికి తప్ప ఎవరికీ తెలియబడ లేదు. జరుగబోవు తర్వాత కాలములో భగవంతునికి సాక్ష్యముగా ఉండునట్లు, భీష్మునికి భగవంతుని విషయము తెలియునట్లు దేవుడే చేశాడు.** అందువలన భీష్మునికి తెలిసినది. భీష్మునికి తప్ప ఎవరికీ కృష్ణుడు భగవంతుడను విషయమే తెలియదు. కృష్ణుడు కూడా నేను మూడు, నాలుగు విధానములను తెలియజేయను వస్తానన్నట్లు రెండు శ్లోకములను చెప్పాడు. అయినా ఆదిలో సూర్యునికి తెలిసిన జ్ఞానము, సూర్యుని ద్వారా భూమిమీద అందరికీ తెలియబడి, చివరికి పూర్తిగా లేకుండా పోయిన

ధర్మములను తెలియజేతును అని అనడము వలన, ఆయన మూడవ విధానము ప్రకారము క్రొత్తగా ధర్మములను తెలియజేయను వచ్చాడని తెలియుచున్నది. నాల్గవ విధానమును గురించి ఫలానా చోట చెప్పుచున్నానని ఎక్కడా చెప్పలేదు. అందువలన కృష్ణుని జన్మలో మూడవ విధానము ప్రకారము తెలియకుండా పోయిన ధర్మములను తెలియజేసాడని, అర్థమగు చున్నది. నాల్గవ విధానము కొరకు ఆయన రాలేదని కూడా తెలియుచున్నది.

**ప్రశ్న :-** ధర్మములను తెలియవచ్చిన వాడు మనిషిగానున్నా, ఆయనను భగవంతుడని అంటున్నాము. భగవంతునిగా వచ్చిన కృష్ణుడు జ్ఞానయోగము ఏడవ శ్లోకములో ధర్మములయందు చేరిన కాలుష్యమును కూడా తీసి వేయుటకు వస్తానని చెప్పడము వలన, నాల్గవ విధానమును కూడా నెరవేర్చుటకు భగవంతుడే వచ్చునట్లు ఆధారము లభించుచున్నది కదా! దీనికి మీరేమంటారు?

**జవాబు :-** నేను ముఖ్య సూత్రమును చెప్పుచున్నాను. దాని ప్రకారము జవాబును నీవే తెలుసుకోవచ్చును. మనిషి శరీరములోని పరమాత్మ ఆత్మవలె నటించి ధర్మములను తెలియజేస్తే అది మూడవ విధానమగును. ఒకవేళ మనిషి శరీరములోని ఆత్మ పరమాత్మవలె నటించి జ్ఞానమును చెప్పితే అది నాల్గవ విధానమగును. ఎదుటి శరీరములోని ఆత్మ ఏదో, పరమాత్మ ఏదో తెలియని మనకు ఎప్పుడు దేవుడు చెప్పుచున్నాడో, ఎప్పుడు జీవుడు చెప్పు చున్నాడో అర్థము కాదు. అందువలన ఈ విషయములో ఎటూ తేల్చి ఎవరూ చెప్పలేరు.

**ప్రశ్న :-** బ్రహ్మవిద్యా శాస్త్రమని హిందువులు, ధర్మశాస్త్రము అని క్రైస్తవులు, దైవ గ్రంథమని ముస్లీమ్‌లు వారివారి గ్రంథములను అంటున్నారు. ఆ విధముగా చెప్పడము వలన వాటిలో ఏమైనా తేడాలున్నాయా?

**జవాబు :-** మూడు రకముల పేర్లతో మూడు మతములవారు పిలువడము

జరుగుచుండుట వాస్తవమే. అయితే మూడు గ్రంథముల పేర్లు వేరుగా కనిపించినా, వాటిలోని భావము మాత్రము ఒక్కటేయున్నది. మూడు గ్రంథములు మూడు పరిమాణములుగా ఆకారములో పెద్దగ చిన్నగా ఉండినప్పటికీ, ఆ మూడు గ్రంథములలో ఒకే దేవుని విషయమునే చెప్పియుండడము వలన, మూడు గ్రంథములలోని విషయములు మనుషులందరికీ అవసరమైన సూత్రములనే బోధించుట వలన, వాటిలో ఏమాత్రము తేడా లేదని చెప్పుచున్నాము.

**ప్రశ్న :-** మూడు గ్రంథములు సమానమైనప్పుడు ఆ గ్రంథములను అనుసరించువారు మూడు మతములుగా చీలిపోయి వేరు వేరు ఆచరణలను ఎందుకు కల్గియున్నారు?

**జవాబు :-** మూడు గ్రంథములకు గ్రంథకర్త ఒక్కడేనని తెలియనివారు, ఒకే దేవుడు మూడు గ్రంథములను మూడు సమయములలో ఇచ్చాడని తెలియని వారు, మూడు గ్రంథములలో సర్వ మానవులకు వర్తించు జ్ఞాన విషయములు ఉన్నాయని గ్రహించనివారు, భావములో మూడు గ్రంథములు ఒకే ఉద్దేశ్యమును కల్గి, ఒకే జ్ఞానమును బోధించుచున్నాయని తెలియనివారు గ్రంథముల పేర్లనుబట్టి, ఆకారములనుబట్టి స్థూల దృష్ఠికలవారై మూడు భాగములుగా చీలిపోయి మూడు మతములుగా చెప్పుకొనుచూ, ఒక్కొక్క మతము వారు ఒక్కొక్క గ్రంథమును అనుసరించుచున్నారు. ఆ విధముగా ఒకే జాతి మానవులు మూడు వర్గములుగా చీలిపోవడము మనుషులలోని తెలివి తక్కువతనము అనియూ, మూర్ఖత్వము అనియూ, అజ్ఞానము అనియూ చెప్పవచ్చును.

**ప్రశ్న :-** మూడు మతములలోనూ వారివారి గ్రంథములందు ఆరితేరిన జ్ఞానులు కలరు. వారి గ్రంథములలోని వాక్యములనూ, శ్లోకములనూ ధారాళముగా చెప్పు జ్ఞానులు కలరు, కష్టమైనా ఇష్టముగా వారి

మతాచరణలను ఆచరించువారు గలరు. వారివారి దేవుని యెడల ఎంతో భక్తిగలవారని పేరుగాంచిన భక్తులు కలరు. అటువంటి ఎంతో గొప్పవారు మూడు మతములలో ఉన్నారు కదా! అంతగొప్ప వారికి కూడా మూడు గ్రంథములలోని విషయములు ఒక్కటేనని తెలియదా?

**జవాబు :-** తెలిసియుంటే మూడు మతాలుగా, మూడు వేరువేరు ఆచరణలు కల్గియుంటారా అని నేను అడుగుచున్నాను. పైకి ఎంత గొప్పవారని పేరు సంపాదించుకొనినా, ఆ పేరు ప్రఖ్యాతులు ప్రాపంచికమే కానీ దైవికము కాదు. ప్రతి ఒక్కడూ నా మతము నా మతమని చెప్పుకొంటున్నారు తప్ప ఒక్కడైనా అందరి మతము ఒక్కటేననీ, అందరిదీ ఒక్కటే జ్ఞానమనీ, అందరికీ ఒక్కడే దేవుడనీ, అందరి గమ్యము ఒకే దేవున్ని చేరుకోవడమేననీ అనుకొంటున్నాడా? మూడు గ్రంథములలో చెప్పినది ఒకడే దేవుడని, మూడు గ్రంథములలో చెప్పినది ఒకటేనని తెలియనివారు గొప్ప జ్ఞానులు, గొప్ప ఆచరణ కలవారని చెప్పుకోవడము శుద్ధ తప్పు. ఒక మతము పేరు చెప్పుకొనుచూ వాడు ఎంత పెద్ద జ్ఞానినని అనిపించుకొనినా, మా లెక్కలో మరియు దేవుని లెక్కలో వాడు అజ్ఞానిగానే పరిగణించబడును. ఒక మతములోని వాడు వాడు అనుసరించుచున్న గ్రంథములోని వాక్యములను కంఠాపాటము చేసుకొని, నిరాటంకముగా ఏకధాటిగా చెప్పగలిగినా వానికున్నది జ్ఞాపకశక్తేగానీ, జ్ఞానశక్తి కాదని చెప్పవచ్చును. నిజమైన దేవుని జ్ఞానమును తెలిసినవాడు ఎవడుగానీ తనది ఒక మతమని చెప్పుకోడు. మతము పేరుతో చెలామణి అగువారు దేవునికి ఎప్పటికీ దగ్గర కాలేరు. నేను ఫలానా మతస్థుడనని చెప్పుకోవడము దేవుని ఉద్దేశ్యమునకు వ్యతిరేఖముగా చెప్పడమగును. దేవుడు అందరూ ఒకే మార్గములోనికి వచ్చి, ఒకే దేవుడైన తననే ఆశ్రయించి, తననే ఆరాధించవలెనను

ఉద్దేశ్యముతో మూడు గ్రంథములను మూడు భాషలలో ఇచ్చి వాటిలో తన భావమును తెలిపియుంటే, ఆయన భావమునకు వ్యతిరేఖముగా మనుషులు మతముల పేరుతో చీలిపోవడము తప్పుకాదా?

మూడు మతములలో బయటికి కనిపించునట్లు ఎందరో గొప్ప జ్ఞానులు, బోధకులు, స్వామీజీలు కలరు. అయినా వారికి దేవుడు చెప్పిన అసలైన మతాతీత జ్ఞానము తెలియక పోవడమునకు ఒక కారణము గలదు. దానిని వివరించి చెప్పుకుంటే ఈ విధముగా కలదు. ఒక మనిషి బయటి ప్రపంచములో ఎంత గొప్పవాడైనా అయివుండవచ్చునుగానీ, అతని శరీరములో అతడు (జీవుడు) గుణముల మధ్యలో చిక్కుకొని ఉన్నాడు. గుణములు తమ మధ్యలో చిక్కుకొన్న జీవున్ని తమ ప్రభావమునకు లోనగునట్లు చేయుచున్నవి. ఒక్కొక్క గుణమునకు ఒక్కొక్క ప్రభావమున్నది. గుణచక్రములో ఒక భాగములో గల పన్నెండు గుణములకు పన్నెండు ప్రభావములు ఉన్నవి. వేరువేరు ప్రభావములు గల గుణములను అన్నిటినీ కలిపి దేవుడు తన గ్రంథమైన భగవద్గీతలో "మాయ" అని పేరు పెట్టాడు. అన్ని గుణముల ప్రభావములో చిక్కుకొన్న జీవున్ని మాయలో చిక్కుకొన్న వాడని చెప్పవచ్చును. ఆ లెక్క ప్రకారము జగతియందు మాయలో చిక్కుకోకుండా (మాయలో లేనివాడు) ఎవడైనా ఉన్నాడా? అంటే లేడనియే చెప్పవచ్చును. ఎందుకనగా శరీరముతోనున్న ప్రతివాడూ (ప్రతి జీవుడూ) గుణచక్రములో గుణముల మధ్యలోనే ఉన్నాడు. కనుక అందరూ మాయలో ఉన్నారనియే చెప్పవచ్చును.

బయట ప్రపంచములో ఒక క్రైస్తవ గురువైనా (పోప్ అయినా) ముస్లీమ్ పండితుడైనా, హైందవ స్వామీజీ అయినా లోపలి ప్రపంచములో గుణములను మాయయందు ఉన్నాడని చెప్పవచ్చును. తాము మాయను

జయించినవారమని చెప్పుకొనినా భగవద్గీతలో విజ్ఞానయోగమందు 14వ శ్లోకమందు **"గుణమయీ మమ మాయా దురత్యయా" "గుణములతో కూడుకొన్న నా మాయను దాటుట దుస్సాధ్యము"** అని దేవుడు అన్నాడు. కొందరు గొప్ప జ్ఞానులమని ప్రకటించుకోవడమే కాకుండా తానే దేవున్ని అనునట్లు ప్రవర్తించుచుందురు. ఎవరు ఎట్లున్నా ఎంత గొప్పగాయున్నా శరీరములోపలి అందరి స్థానమూ ఒక్కటే. మాయ యను బావిలో మునిగి బయటికి రాలేని పరిస్థితే అందరిదీ అని చెప్పవచ్చును. అందువలన భగవద్గీతలో దేవుడు నా మాయను దాటుట దుస్సాధ్యమని చెప్పాడు. మాయను గురించి అంత గట్టిగా మాయను జయించుట సాధ్యము కాదని దేవుడు ఎందుకు అన్నాడని ఆలోచిస్తే, గుణములను గురించిన కొంత వివరము తెలియుచున్నది. దైవ నిర్మితములైన గుణములు ఎంతో బలమైనవనీ వాటినుండి ఎవరూ తప్పించుకోలేరనీ తెలియుచున్నది. నిజమైన దేవునియొక్క ధర్మము తెలిసి అధిపతియైన దేవున్నే శరణుజొచ్చి, ఆయననే ఆరాధించువాడు తప్ప మిగతావాడు ఎవడైనా మాయను దాటి రాలేడు.

**ప్రశ్న :-** కొందరు ఇతర దేవతలను ఆరాధించకుండా, అందరికంటే గొప్ప దేవుడేననీ, ఆయననే ప్రార్థించుచున్నాము అంటున్నారు కదా! మూడు మతములలో ఇస్లామ్ మతమువారు మేము అల్లాహ్‌ను తప్ప ఎవరినీ ప్రార్థన చేయడములేదు, అల్లాహ్‌ను తప్ప ఎవరినీ గొప్పగ తలచడములేదు అంటున్నారు. వారు కూడా మాయలో ఉన్నట్లేనా? వారు మాయను జయించి దేవునికి దగ్గరైనట్లు కాదా?

**జవాబు :-** అల్లాహ్ తప్ప వేరే దేవుడే లేడనీ, అల్లాహ్‌నే ప్రార్థించాలని ముస్లీమ్‌లలో ప్రతి ఒక్కరికీ తెలుసు. అయినంతమాత్రమున వారుకూడా మాయనుండి బయటపడలేదనియే చెప్పవచ్చును. దేవుడు అందరికంటే గొప్పవాడు దేవున్ని తప్ప ఇతరులను ఆశ్రయించకూడదని చెప్పినా, వారికి

దేవుని ధర్మములు ఏవీ తెలియవు. అందువలన ఎంత పెద్ద ముస్లీమ్ భక్తుడైనా, అతడు మతము అను దానిలో చిక్కుకొని ఇది నా మతము అంటున్నాడు. ఎప్పుడైతే మతము అనునది మనిషిలో ఉందో, అప్పుడు అతడు మాయలో ఉన్నట్లే భావించవలెను. మతము అనునది ఏ కోశములో ఉన్నా అతను గుణములలో పూర్తి చిక్కుకొని బయటపడలేడని అర్థమగు చున్నది. ఈ విధముగా అన్ని మతముల వారు మతము అను ప్రాథమిక అజ్ఞానమునే జయించలేనప్పుడు, మాయను జయించనట్లే లెక్కించవలెను. ఎవరికైనా ఇదే సూత్రము వర్తించునని తెలియవలెను.

**ప్రశ్న :-** శరీరములోనున్న మాయ శరీరములోనున్న జీవున్ని ఎంతో బలముగా తనలోనే అణచివేయుచున్నదంటే, మాయకు బలము ఎట్లున్నది? ఏ విధముగా జీవుని మీద పని చేయుచున్నది?

**జవాబు :-** మాయ అనునది ప్రత్యక్షముగా ఉన్నది కాదు. మాయ పరోక్షమైనది. ప్రత్యక్షముగాయున్నవి గుణములని తెలియవలెను. మీకు అర్థమగుటకు గుణములు ప్రత్యక్షముగాయున్నవి అంటున్నాను. వాస్తవముగా గుణములు ఎవరిలోనూ ప్రత్యక్షముగాలేవు. గుణములు కంటికి కనిపించునవి కావు. జ్ఞాననేత్రము ద్వారా చూచి తెలుసుకోవచ్చును. పన్నెండు గుణములను కలిపి వాటి సారాంశమును మాయ అంటున్నాము. మనిషి తలలోని గుణచక్రములో మూడు భాగములుగా యున్న గుణచక్ర మందు ప్రతి భాగములోనూ పన్నెండు గుణములుండునని ముందే తెలుసుకొన్నాము. అందులో ఆరు మంచి గుణములు, ఆరు చెడు గుణములు ఉండును. చెడు గుణములు వరుసగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అనునవికాగా, మంచి గుణములు వరుసగా దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ అనునవిగా ఉన్నవి. వరుసగాయున్న చెడు గుణములకు మంచిగుణములు వ్యతిరేఖముగా ఉంటూ అదే వరుసలో

ఒకదానికొకటి ఎదురుగానున్నవి. కామమునకు దానము ఎదురుగా ఉండగా, క్రోధమునకు దయ, లోభమునకు ఔదార్యము, మోహమునకు వైరాగ్యము, గర్వమునకు వినయము, అసూయకు ప్రేమ ఎదురుగాయున్నవి. ఎదురుగాయున్నట్లే చెడు గుణ ప్రభావములకు వ్యతిరేఖముగా మంచి గుణ ప్రభావములున్నవి. చెడు మంచి గుణములని వాటిని విభజించి చెప్పుటకు వాటి వలన వచ్చు ఫలితములు మంచి చెడుగా, పుణ్య పాపములుగా ఉండుట వలన అలా చెప్పవలసి వచ్చినది.

పన్నెండు గుణములకు వేరే వేరు ప్రభావములున్నవని చెప్పాము కదా! ఆ పద్ధతి ప్రకారము చెడు గుణములలో మొదటిదైన ఆశ (కామము) అను గుణమునకు ఒక ప్రత్యేక ప్రభావముండును. దానికి వ్యతిరేఖముగా ఎదురుగానున్న దానము అను గుణమునకు కూడా ప్రత్యేక ప్రభావ ముండును. ఈ విధముగా ఒక్కొక్క గుణమునకు ఒక్కొక్క ప్రభావమున్నదని తెలిసిపోయినది. గుణము స్థూలమైనది కాదు, సూక్ష్మమైనది దీనినిబట్టి గుణములు కనిపించకుండా ఉన్నవని చెప్పవచ్చును. సూక్ష్మముగా కంటికి కనిపించకుండా యున్నా జ్ఞానదృష్ఠికి తెలియునట్లు గలవు. సూక్ష్మముగానైనా ఉండుట వలన వాటికి దేవుడు ఒక పరిమితమైన ఆకారమునూ, పరిమితమైన ప్రభావమునూ కల్పించాడు. జ్ఞానదృష్ఠికి గుణముల ఆకారములు తెలియును, అలాగే వాటి ప్రభావములూ తెలియును. ఒక గుణము గుణచక్రభాగములో ఒకచోట ఉన్నా దానికి గల ప్రభావము గుణచక్ర భాగమంతయు వ్యాపించియుండును. పన్నెండు గుణములకు వేరు వేరుగా పన్నెండు ప్రభావములు గుణచక్ర భాగమంతా నిండి యుండును. ఒకే తీగయందు వంద టెలిఫోన్ నంబర్లు ప్రయాణించు చున్నా, వాటి కోడ్ వేరుగా ఉండుట వలన ఒకదానితో ఒకటి కలియకుండా వేరు వేరుగా ప్రయాణించునట్లు ఒకే గుణ భాగమునందు పన్నెండు గుణ ప్రభావములున్నా అవి ఒకదానితో ఒకటి కలియకుండ వేరువేరు ప్రభావములు కల్గియున్నవి.

భావము అంటే భాషలోవుండే అర్థము. భాష కనిపించినా, వినిపించినా భావము కనిపించదు వినిపించదు. భావము మనిషిలోని బుద్ధిని మార్చగలదు. తెలుగు భాషలోని ఒక పదమును ఒక సందర్భములో వాడినప్పుడు దాని భావము మనలో ఎలా పనిచేయుచున్నదో ఉదాహరణకు గమనిద్దాము.

ఒకచోట ముగ్గురు వ్యక్తులున్నారనుకొనుము. ముగ్గురు వ్యక్తులలో ఒకరివద్ద తేనె ఉన్నది. ఒకటవ వాడు తనయొద్ద గల తేనెను రెండవ వాని చేతిలోనికి వేసాడు. ప్రక్కనే ఉన్న మూడవ వాడు తేనెను చూచి నాకు అన్నాడు. నాకు అంటూనే రెండవవాడు చేతిలోని తేనెను నాలుకతో నాకు కొన్నాడు. మూడవవాడు మరియొక మారు నాకు అన్నాడు. అప్పుడు రెండవవాడు నాకినాను అయిపోయింది అన్నాడు. మొదటివాడు మూడవ వాడు తేనె కావలెనని అడుగుచున్నాడని గ్రహించి, తనయొద్ద యున్న తేనె మూడవవానికి కూడా కొంత ఇచ్చాడు. ఇక్కడ నాకు అను శబ్ధము యొక్క భావము రెండవ వానికి ఒక రకముగా అర్థముకాగా, మొదటివానికి మరొక రకముగా అర్థమైనది. మూడవవాడు రెండవమారు అడుగువరకు మొదటి వానికి కూడా సరియైన భావము అర్థము కాలేదు. రెండవవానికి తేనెను నాలుకతో రుచి చూడమన్నట్లు అర్థమైనది. మూడవవాని ఉద్దేశ్యములో తనకు కూడా కావాలను అర్థముతో నాకు అన్నాడు. ఈ విధములో ఒకే పదములో రెండు భావములు పుట్టినట్లు అర్థమైనది కదా! ఈ విధముగా ఒకే పదమునకు నాలుగు అయిదు భావములు కూడా ఉండును. అయితే సమయము సందర్భమునుబట్టి వాటిలో సరియైన అర్థమును గ్రహించవలసి యుండును. ఇక్కడ ఒక పదములో భావము ఎట్లున్నది అర్థమైనది కదా! భాష వ్రాతలో కనిపించినా, శబ్ధములో వినిపించినా అందులోని భావము మాత్రము బాహ్య జ్ఞానేంద్రియములకు తెలియదు. శరీరములోనున్న అంతః కరణములలో ఒకటైన బుద్ధికి మాత్రము తెలియును. ఒక భాషలోని

శబ్ధమునకు నాలుగైదు అర్థములున్నప్పుడు అందులో ఏదో ఒక దానిని మాత్రము బుద్ధి గ్రహించును. ముగ్గురు వ్యక్తులు తేనెవద్ద నాకు అను శబ్ధమునకు మూడు విధముల అర్థము చేసుకొన్నట్లు, ఉన్న అర్థములలో ఏదో ఒక అర్థమును మాత్రమే బుద్ధి గ్రహించి జీవునికి అందించును. ఒక పదమునకు అర్థములు వేరు వేరుగా నాలుగైదున్నా లేక రెండు మూడున్నా, అందులో నుండి బుద్ధి ఒక్కదానిని మాత్రమే గ్రహించును తేనె విషయములో నాకు అని మూడవ వాడు తన భావముతో అడిగితే, రెండవ వాని బుద్ధి తేనెను నాకేయమని చెప్పినట్లు గ్రహించినది. దీనినిబట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా అర్థమైనట్లు తెలిసినది.

ఈ విధముగా బుద్ధి ఒక్క భావమును మాత్రమే గ్రహించును. బుద్ధి గ్రహించిన భావములోనే జీవుడుండి పోవును. అందువలన దేవుని జ్ఞానము కూడా ఒక్కొక్కనికి ఒక్కొక్క విధముగా అర్థమగుట వలన మనుషులు ఒకే దేవుని మీద కూడా వేరు వేరు భావములు కల్గియున్నారు. దేవుడు అణువణువున ఉన్నాడని ఒకడంటే, దేవుడు అంతటా లేడు, ఆయన ఏడవ ఆకాశములో ఉన్నాడని మరొకడు అంటున్నాడు. వాని బుద్ధికి అలాగే అర్థమైనది. కావున వాడు అదియే సత్యమని అంటున్నాడు. బుద్ధి గ్రహించునది ఒక్క భావమునే అయినా ఆ భావము కనిపించునది కాదు. బుద్ధి గ్రహించు భావము తన ప్రభావమునకు మనిషిని లోనగునట్లు చేయుచున్నది. నీవు మనిషివే కాదు దేవునివి అని మరొకనిని గురించి అంటే, వాడు దానిలోని భావమును గ్రహించి ఆ భావములో పుట్టిన ప్రభావమునకు లోనయిపోయి, తనను పొగిడినట్లు సంతోషపడిపోవును.

మనిషి బుద్ధి భాషలోని భావమును గ్రహించినప్పుడు ఆ భావము నుండి పుట్టినది ప్రభావము. నీవు మనిషివి కాదు దేవుడవు అన్నప్పుడు వినినవాడు గ్రహించిన భావమునుబట్టి జీవుడు ప్రభావమునకు లోనయి తనను గొప్పగా అంటున్నాడని సంతోషించును. మరొక సందర్భములో

నీవు మనిషివే కాదు అని వినిపించి, దేవునివి అను మాట వినిపించలేదనుకోండి. అప్పుడు అతని బుద్ధి గ్రహించిన దానినిబట్టి తనను దూషించుచు నీవు జంతువు అన్నట్లు అర్థమైనది. దాని ప్రభావము చేత ఆ మనిషి మారిపోయి, నీవు మనిషివి కాదు అన్న వాని మీద ద్వేషమును పెంచుకొన్నాడు. ఒకే భాష ఒకే అర్థమునిచ్చినప్పటికీ వినికిడిలో తేడా వచ్చినందువలన భావములో పుట్టిన ప్రభావముల వలన మనిషి మారిపోవడము జరుగుచున్నది. కురుక్షేత్ర యుద్ధములో ధర్మరాజు "అశ్వత్థామ హతః కుంజరః" అని అన్నాడట. అందులో చివరి పదమైన కుంజ రః అను పదమును చిన్నగా తక్కువ శబ్ధముతో అనుటవలన, ఆ చివరి మాట వినిపించకపోవడము వలన "అశ్వత్థామ హతః" అను మాటను విన్న ద్రోణుడు అశ్వత్థామ అను తన కుమారుడు చనిపోయాడని గ్రహించి, దాని ప్రభావముతో చేష్టలు లేని నిశ్చేష్టుడయి నిలబడి పోయాడు. యుద్ధ రంగములో యుద్ధము చేయక నిలిచిపోయిన ద్రోణున్ని శత్రువులు సులభముగా చంపివేశారు. అక్కడ చెప్పినది "అశ్వత్థామ అను ఏనుగు చనిపోయింది" అను మాటయితే ద్రోణునికి కుంజరః అను మాట వినిపించకపోవడము వలన అశ్వత్థామ అను ఏనుగు అని అర్థముకాక అశ్వత్థామ అను తన కొడుకే చనిపోయాడని అనుకోవడము జరిగినది. బయటనుండి వచ్చు శబ్ధము జ్ఞానేంద్రియమైన చెవికి వినిపించగా ఆ సమాచారమును మనస్సు లోపలనున్న బుద్ధికి అందివ్వగా, బుద్ధి తాను గ్రహించుకొన్నదానినే జీవునికి తెలుపును. బుద్ధి బయటి భావమును గ్రహించినప్పుడు బుద్ధినుండి ప్రభావము పుట్టుచున్నది. క్రొత్తగా పుట్టిన భావమును ప్రభావము అంటున్నాము. ప్ర అనగా పుట్టినదని ఒక అర్థము కాగా, ప్ర అనగా ముఖ్యమైనదని కూడా అర్థము కలదు. బుద్ధి గ్రహించిన భావమునుండి ప్రభావము పుట్టుచున్నది. ప్రభావము మనిషిలో (జీవునిలో) మార్పును తెచ్చి మనిషిని సుఖదుఃఖములకు లోను చేయుచున్నది.

భావము వేరు ప్రభావము వేరని తెలియుచున్నది. భావముకంటే ప్రభావము గొప్పదని తెలిసిపోవుచున్నది. ఇప్పుడు శరీరములోని గుణముల విషయమువరకు వచ్చి చూస్తాము. గుణములలో ప్రభావము మాత్రము ఉండును. బయటి విషయము చెవి ద్వారా, మనస్సు తెచ్చిన విషయము బుద్ధికి చేరగా బుద్ధి ప్రక్కనేయున్న గుణములు, వచ్చిన భావమును తమ ప్రభావముతో చేర్చుచున్నవి. బుద్ధికి విషయ భావము చేరగానే, గుణములే బుద్ధికి వచ్చిన దానిని తమ ప్రభావమునకు గురిచేయుచున్నవి. అందువలన బుద్ధి దగ్గరనే భావము ప్రభావముగా తయారగుచున్నది. శరీరములో బుద్ధి జీవున్ని అంటుకొని ఒక పొరగా యున్నది. జీవుడు గుండ్రని మూడు పొరలుగల ఆకారముగా ఉంటూ మూడు పొరల మధ్యలో గల శూన్యముగా యున్నాడు. గుండ్రని ఆకారము గల జీవుడు గుణచక్రములో గుణముల యందు నివసిస్తున్నాడు. జీవుడున్న స్థితిని దృశ్యరూపముగా చూస్తే క్రింది బొమ్మలోని విధముగా ఉండును.



పై చిత్రములో రాజస గుణ భాగములో జీవుడున్నాడు. తామస, రాజస, సాత్త్విక అను మూడు గుణ భాగములలో ఒక్కొక్క దానియందు పన్నెండు గుణములుండును. పన్నెండు గుణములు ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రభావమును కలిగియుండును. జీవునికి అంటుకొనియున్న బుద్ధిపొరను బయటినుండి వచ్చిన విషయ భావము చేరగానే, ఆ భావమునకు తగిన గుణము వచ్చిన భావమును తన ప్రభావముగా మార్చుచున్నది. పన్నెండు గుణముల ప్రభావములు గుణ భాగమంతా నిండియుండగా, జీవుడు అందులోనేయున్నాడు. జీవుడు గుణముల ప్రభావముల పరిధిలోనేయున్నా బయటినుండి విషయము చేరువరకు ఏ గుణ ప్రభావమూ జీవున్ని అంటుకోదు. విషయ భావము మనస్సు నుండి వచ్చి బుద్ధిని చేరిన వెంటనే, వచ్చిన విషయమునకు సరియగు గుణము యొక్క ప్రభావము బుద్ధిని చేరి బుద్ధివద్దనే వచ్చిన భావమును ప్రభావముగా చేయుచున్నది. అలా చేరిన ప్రభావము వలన కార్యములు జరుగడమూ, జీవుడు సుఖ దుఃఖములను పొందడమూ జరుగుచున్నది.

భావము అనునది కనిపించదు అన్నాము. అలాగే ప్రభావము కూడా కనిపించక జీవుని బుద్ధిమీద, జీవుని మీద ఒత్తిడి తెచ్చును. ఆ ఒత్తిడి బలమైనదిగా ఉండును. ఎంత బలమైన ఒత్తిడిని జీవుని మీద గుణము చూపుచున్నది అను ప్రశ్నకు జవాబుగా గుణచక్రముకంటే పైనగల కర్మచక్రములోనున్న కర్మనుబట్టి గుణ ప్రభావ ఒత్తిడి యొక్క బలము ఉండునని చెప్పవచ్చును. ఒకే విషయము ఇద్దరిలో చేరగా వారివారి కర్మనుబట్టి గుణముల ఒత్తిడి వారిమీద పడును. అలా ఒకే విషయములో ఇరువురు వేరు వేరు ప్రభావములకు గురియై వేరు వేరు ఒత్తిడులు కల్గి, వేరు వేరు బాధలను అనుభవించుచున్నారు. ఒకే విషయములో ఇద్దరు సమానముగా బాధలకు గురి కాకపోవడమునకు వారిలోనున్న వేరు వేరు

కర్మలే కారణమని తెలియుచున్నది. ఈ విధముగా ఒక మనిషి ఒక బాధను అనుభవించవలెననినా, లేక సుఖమును అనుభవించవలెననినా, వానిలోని మనస్సు ద్వారా విషయము చేరవలెను. చేరిన విషయము బుద్ధివద్ద గుణ ప్రభావమునకు గురి కావలెను. ఆ గుణ ప్రభావము పైనగల కర్మనుబట్టి బలమును పెంచుకొని, జీవునిమీద ఒత్తిడి చేయును. అప్పుడు కర్మవలన పెరిగిన ఒత్తిడి బలము ఎంతవుంటే అంత జీవుడు తప్పక అనుభవించవలసి వచ్చుచున్నది. ఇది శరీరములో ఎవరికీ తెలియకుండా జరిగే విధానమని తెలుపుచున్నాము.

**ప్రశ్న :-** ఎంతో పేరు ప్రఖ్యాతులు గల స్వామీజీలు, ప్రవక్తలు, ప్రబోధకులు, మతపెద్దలు, స్వచ్ఛమైన నిష్ఠాగరిష్ఠులు, ఏకాగ్ర చిత్తముగలవారు, జ్ఞాన మార్గములో సత్ ప్రవర్తన గలవారు ఎందరో ఉండగా వారందరూ చెప్పని విషయమును, వారందరికీ తెలియదని మీరు చెప్పితే ఎలా నమ్మాలి?

**జవాబు :-** మేము చెప్పిన దానిని తప్పనిసరిగా అందరూ నమ్మాలి అని మేము ఎక్కడా చెప్పలేదు. ఇక్కడ కూడా ఇది ఎవరికీ తెలియని విషయము తెలుపుచున్నామని అన్నాముగానీ, తప్పనిసరిగా మా మాటే సత్యము మీరు నమ్మండి అని చెప్పలేదు, ఎవరైనా మా మాటను నమ్మేదానికి, నమ్మక పోయేదానికి వారి శరీరములోపల ఒక విధానమున్నదని కూడా మాకు తెలుసు. అటువంటప్పుడు లోపలయున్న విధానమును అనుసరించి కొందరు నమ్మగలరు, కొందరు నమ్మలేరని తెలుసు. మీకు పుర్తిగా అర్థమయ్యేటట్లు ఆ విధానమును తెలిపెదను చూడండి. ఇంతకుముందే బయటనుండి విషయములు శరీరములోగల జీవునివద్దగల బుద్ధికి చేరునని చెప్పాము. అలాగే ఇప్పుడు గ్రంథరూపముగా చెప్పెడి సంగతులు కూడా చదివే ప్రతి ఒక్కరి శరీరములోని బుద్ధికి చేరును. అయితే లోపలికి చేరే విషయములను ముందుగానే మనము రెండుగా విభజించుకోవలసియున్నది.

ఒకటి ప్రపంచ విషయములు, రెండు పరమాత్మ విషయములు. ప్రపంచ విషయములు లోపలికి చేరితే, ఇంతకుముందు మనము చెప్పుకొన్నట్లే బుద్ధికి చేరడమూ, గుణ ప్రభావముగా మారడమూ, అది కూడా కర్మకు లోబడి జరుగడమూ ఉండునని తెలుసుకొన్నాము. ఇక్కడ లోపలికి చేరిన ప్రపంచ విషయమును నమ్మాలా లేదా అను నిర్ణయము కర్మ ఆధారముతోనే ఉండును. లోపలయున్న కర్మనుబట్టి ఏ విషయమునైనా నమ్మడమో నమ్మక పోవడమో జరుగుతుంది. ఖచ్చితముగా నమ్ముతాడనిగానీ, నమ్మడనిగానీ చెప్పలేము. అది వారి వారి కర్మనుబట్టియుండును.

ఇక దేవుని విషయములను గురించి చెప్పితే, ఆధ్యాత్మిక విషయము లన్నియు మనస్సు ద్వారానే లోపలికి పోవలసియుండును. ప్రపంచ విషయములు శరీరములోని జీవునికి చేరినట్లే పరమాత్మ విషయములు కూడా లోపలి జీవునికి చేరవలెను. ఒక ఆధ్యాత్మిక (ఆత్మకు సంబంధించిన) విషయము చెవికి వినపడియో, లేక కంటి ద్వారా చదువబడియో లోపలికి చేరగా కన్ను, చెవిని ఆనుకొనియున్న మనస్సు ఆ విషయమును లోపల జీవునివద్దయున్న బుద్ధికి చేర్చును. బుద్ధికి చేరిన విషయము జీవునికి చేరినట్లేయగును. చేరిన విషయము దైవ సంబంధమైన జ్ఞానము అయినందున అక్కడ దేవుని జ్ఞాన విషయముల మీద కర్మ పని చేయదు. కనుక గుణ ప్రభావములు జ్ఞాన విషయముల మీద ఉండవు. ప్రపంచ విషయములైతే అవి కర్మకు లోనయి గుణముల ప్రభావములో మునిగి, కర్మ ప్రకారము నమ్మడమో నమ్మకపోవడమో జరుగును. ఇక్కడ జ్ఞాన విషయములైనందున కర్మకు అతీతమైనది జ్ఞానము, కనుక కర్మ ఏమాత్రము జ్ఞాన విషయముల మీద పనిచేయకపోవడము వలన, కర్మను అనుసరించి యున్న గుణములు కూడా పనిచేయవు. అందువలన జ్ఞాన విషయముల

సంబంధముగా మనిషిలోని శ్రద్ధ మాత్రమే పనిచేయును. లోపలికి చేరిన జ్ఞాన విషయమును వాని శ్రద్ధనుబట్టి నమ్మడమో, నమ్మక పోవడమో జరుగును. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అను భగవద్గీత వాక్యము ప్రకారము దైవజ్ఞానము మీద శ్రద్ధయుంటే వాని శ్రద్ధనుబట్టి వాడు విశ్వసించడము జరుగును. పూర్తి శ్రద్ధయుంటే తెలిసిన విషయము మీద పూర్తి విశ్వాసము ఏర్పడును. తక్కువ శ్రద్ధయుంటే తక్కువ విశ్వాసము కల్గును. పూర్తి శ్రద్ధ లేకపోతే అతడు తెలిసిన జ్ఞాన విషయమును నమ్మకుండ వదలివేయును. అందువలన శ్రద్ధలేని వానికి జ్ఞానము లభించదని పెద్దలు తెలుపడము జరిగినది. శ్రద్ధను బట్టి జ్ఞానము కనుక, ఇప్పుడు మేము చెప్పిన విషయము మీలోనికి చేరినా, అది మీ శ్రద్ధనుబట్టి మీరు నమ్మడమో, నమ్మక పోవడమో జరుగును. ఇదంతయు తెలిసిన నేను మిమ్ములను నమ్మమని ఎలా చెప్పగలను? మీ శ్రద్ధనుబట్టి నా జ్ఞానమును మీరు నమ్మడమో, నమ్మక పోవడమో జరుగును. అంతేగానీ బయటి వక్తలు, ప్రవక్తలు, స్వామీజీలు చెప్పినంతమాత్రమున నమ్ముదురని చెప్పలేము.

**ప్రశ్న :-** గుణములు గుణచక్రములో కదలక మెదలకయున్నా, వాటి ప్రభావములు గుణచక్రమంతయు వ్యాపించియుండి, బయటినుండి వచ్చిన విషయము బుద్ధిని చేరిన వెంటనే అక్కడ అవసరమైన గుణ ప్రభావము ఏర్పడుచున్నదనీ, అది వాని కర్మనుబట్టి ఎంత కర్మయుండునో అంత బలమైన ప్రభావము కల్గి జీవుని మీద ఒత్తిడి తెచ్చునని చెప్పారు. జీవుని మీద గుణముల ఒత్తిడి కల్గుచున్నదా? లేక కర్మ ఒత్తిడి కల్గుచున్నదా?

**జవాబు :-** మనిషి అనుభవించవలసినది ఏదైనా కర్మ కారణము చేతనే అనుభవించును. అయినా ఆ అనుభవమంతా గుణముల ఒత్తిడి చేతనే ఉండును. కర్మ ఎవరిమీద నేరుగా ఒత్తిడి చేయదు. మనిషి మీద గుణముల వత్తిడి తప్ప కర్మ ఒత్తిడియుండదు. అందువలన ఎవడైనా తాను ఏ

గుణముల వలన బాధను అనుభవిస్తున్నానని తెలియగలడుగానీ, తాను ఏ కర్మవలన బాధను అనుభవిస్తున్నానని చెప్పలేడు. బాధ వెనుక కర్మయే కారణమైనా అది ఏ కర్మనో, ఎటువంటి కర్మనో ఎవరికీ తెలియదు. మనిషి అనుభవించు ప్రతి బాధ తనకు ఏ గుణము వలన కల్గినదో చెప్పగలడు. అందువలన అనుభవించే ప్రతి దానికీ కర్మ కారణమైయున్నా, అది నేరుగా మనిషిమీద పడి బాధించక, గుణముల ప్రభావమును ఉపయోగించుకొని మనిషిని బాధించుచున్నది. ప్రతి మనిషిలోనూ అలాగే జరుగుచున్నది. కావున మనిషిమీద గుణముల ఒత్తిడి తప్ప కర్మ ఒత్తిడి ఉండదని తెలియుచున్నది. అంతేకాక గుణముల ప్రభావమునకు బలము కర్మచేత కల్గుచున్నదని చెప్పవచ్చును. కర్మ ఎంత బలముగా ఉంటే అంత బలముగా గుణ ప్రభావము పెరుగును.

**ప్రశ్న :-** కర్మనుబట్టి గుణ ప్రభావము పెరుగును అంటున్నారు కదా! కర్మ ఇంత ఉంటే గుణము ఇంత పెరుగునని అనుటకు ఏదైనా ఆధారమున్నదా? కర్మనుబట్టి గుణము యొక్క ప్రభావము పెరుగుననుటకు శాస్త్రాధారము ఏమైనా ఉన్నదా?

**జవాబు :-** సుఖమునుగానీ, కష్టమునుగానీ మనిషి అనుభవించునప్పుడు దానికి కారణము కర్మయే అయినా, ఆ కర్మ ఏమిటో ఎవరికీ తెలియదు. కొందరికి కష్ట సుఖములకు కర్మ కారణమను విషయము కూడా తెలియదు. కొందరికి ప్రతి పనికీ, ప్రతి సుఖమునకూ, ప్రతి దుఃఖమునకూ కర్మే కారణమని తెలిసినా, వారికి జరిగే పనిలో, అనుభవించే కష్టములో గుణములే కనిపించుచుండునుగానీ, కర్మ ఎవరికీ కనిపించడము లేదు. అందువలన ఎంత కర్మకు ఎంత సుఖము ఎంత కష్టమను మాటే లేకుండా పోయినది. గుణమును బట్టియే పనులు, గుణమునుబట్టియే కష్ట సుఖములనునట్లు చాలామందికి అర్థమైనది. అయితే బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము (ధర్మ శాస్త్రము ప్రకారము) ఒక గుణమునకు ఒక కర్మ అను సూత్రమును

అనుసరించి గుణము వెనుక కర్మయున్నదని తెలియుచున్నది. కర్మ వివరమును తెలియాలంటే కర్మచక్రమును గురించి తెలియవలెను. కర్మ చక్రములోని కర్మలు గుణములనుబట్టి ఏర్పడియుండును. మంచి గుణములనుబట్టి మంచి కర్మయిన పుణ్యమూ, చెడు గుణములనుబట్టి చెడు కర్మయిన పాపమూ ఏర్పడి కర్మచక్రములో నిలువయుండును. అలా నిలువ యున్న కర్మ కారణము చేతనే గుణముల ప్రభావము పెరుగుచున్నది. అందువలన కర్మ వలన గుణములూ, గుణముల వలన కర్మమూ అవినాభావ సంబంధముకల్గియున్నవని చెప్పవచ్చును.

కర్మ ముందా, గుణములు ముందా అని చెప్పుటకు కూడా వీలులేని విధముగానున్న విధానమును తెలియుటకు కర్మనే ముందుగా తీసుకొని పై కర్మచక్రమునుండి పరిశోధన ప్రారంభించవలసియున్నది. కర్మచక్రమును జ్ఞానదృష్ఠితో చూడగల్గితే కర్మచక్రము పన్నెండు భాగములుగాయున్నది. పన్నెండు భాగములుగా విభజింపబడియున్న కర్మచక్రములో ముఖ్యమైన కర్మలు పన్నెండు గలవు. మనిషి పుట్టినది మొదలు చనిపోవువరకు మనిషికి గల జీవితమును పన్నెండు కర్మలే శాసించి నడుపుచున్నవి. అటువంటి పన్నెండు కర్మలు కర్మచక్రములోని పన్నెండు భాగములలో ఒక్కొక్క భాగము నందు ఒక్కొక్క కర్మ నిలువయుంటున్నది. ఒక్కొక్క భాగములోని ఒక్కొక్క కర్మ తొమ్మిది భాగములుగా విభజింపబడియున్నది. ఒక్కొక్క కర్మ తొమ్మిది భాగములుకాగా పన్నెండు భాగములందు 12×9=108 కర్మలుగా చీలిపోయినవి.

క్రిందగల గుణచక్రములో ఒక్కొక్క భాగమునందు పన్నెండు గుణములు కలవు. పన్నెండు గుణములు కూడా ఒక్కొక్కటి తొమ్మిది భాగములుగా విభజింపబడియున్నవి. ఈ విధముగా పన్నెండు గుణములు మొత్తము 12×9=108 గుణములుగా చీలిపోయినవి. పైనగల కర్మ

చక్రములో పన్నెండు భాగములలో కర్మ 108 రకములుగా విభజింపబడి యుండగా, అదే విధముగా క్రిందగల గుణచక్రములో కూడా పన్నెండు గుణములు 108 రకములుగా విభజింపబడియున్నవి. పైన కర్మచక్రములో కర్మలు, క్రింద గుణచక్రములోని గుణములు రెండూ సమానముగా విభజింప బడియున్నట్లు తెలిసిపోయినది. మనిషి శరీరములోనికి బయటి విషయము చెవి శబ్దము వినుట ద్వారాగానీ, కన్ను చదవడము వలనగానీ, శరీరము లోనికి ప్రవేశించినప్పుడు శరీరములో జ్ఞానేంద్రియముల వరకు వ్యాపించి యున్న మనస్సు ఆ విషయమును గ్రహించి తలయందుగల బుద్ధికి చేర్చును. బుద్ధికి విషయము చేరిన వెంటనే దానికి సంబంధించిన గుణముయొక్క ప్రభావము కర్మానుసారము బుద్ధికి చేరును. ఉదాహరణకు ఒక వ్యాపార విషయమును గురించి విన్నప్పుడు ఆ విషయము మనస్సు ద్వారా బుద్ధికి చేరినప్పుడు దానికి సంబంధించిన గుణము ఆశ (కామము) అయినందున వ్యాపార విషయములో లాభమునకు సంబంధించిన విషయమగుట వలన, ఆశ అను గుణములోని తొమ్మిది భాగములలోని పెద్ద గుణము యొక్క ప్రభావము బుద్ధి మీద ఒత్తిడి కల్గించినది. ఇక్కడ ముఖ్యముగా తెలియ వలసినదేమనగా! అక్కడ బుద్ధికి చేరిన గుణమేదైనా దానికి పన్నెండింతలు ఎక్కువగా హెచ్చించి వచ్చిన సంఖ్యంత బలము బుద్ధిమీద ఒత్తిడి కల్గించిన దని చెప్పవచ్చును. బుద్ధికి ఒత్తిడి కల్గితే దానిని అంటుకొనియున్న జీవునికి ఒత్తిడి కల్గినట్లేనని తెలియవలెను. తొమ్మిది ఆశలలో పెద్ద ఆశ ఆ విషయమును చేరి ప్రభావమును చూపగా, ఆ ప్రభావము పన్నెండింతలు ఎక్కువగా మారి జీవునిమీద ఒత్తిడి తెస్తున్నది. బుద్ధికి అంటుకొను ఏ గుణమైనా పైన గల కర్మనుబట్టి పన్నెండింతలుగా గుణించబడి అంతే బలముతో జీవునిమీద ఒత్తిడి తెస్తున్నది. పన్నెండింతలుగా గుణించబడుట వలన అక్కడ చేరిన ఆశ అను భావమును ఆశ అను గుణము

అంటున్నాము. గుణించబడునది గుణము అను పేరుకల్గియున్నది. 108 చీలికలుగానున్న ప్రతి గుణము బుద్ధికి చేరినప్పుడు తనకున్న ప్రభావమును పన్నెండింతలు హెచ్చించబడుచుండుట వలన ప్రతి భావమును గుణము అంటున్నాము.

ప్రతి గుణము తనకున్న ప్రభావమును పన్నెండింతలు పెంచుకొని జీవునిమీద ఒత్తిడిని కల్గించినా, 108 గుణములలో ఏ గుణము వలన వచ్చు పాపము మరియు పుణ్యమైనా 108 కర్మలుగా మారి కర్మచక్రములో చేరిపోవుచున్నది. కర్మచక్రములోని 108 కర్మలు క్రిందగల గుణచక్రములోని 108 గుణముల వలన ఏర్పడుచున్నవని తెలియవలెను. గుణచక్రములోని ఆశ అను గుణము తొమ్మిది భాగములుగా విభజింపబడి పెద్ద గుణమునుండి చివరకు చిన్న గుణము వరకు పరిమాణమున్నదని చెప్పుకొన్నాము. ఒక గుణము తొమ్మిది భాగములుగా విభజింపబడినప్పుడు చివరి చిన్న గుణమునకు రెండింతలు పెద్దదిగా ఎనిమిదవ గుణముండగా, ఎనిమిదవ దానికి రెండింతలు పెద్దదిగా ఏడవ గుణముండును. అదే విధముగా ఏడవదానికి రెండింతలు పెద్దదిగా ఆరవ గుణముండును. ఇట్లు ఒకదాని కొకటి రెండింతలు పెద్దదిగా ఉంటూ చివరి పెద్ద గుణము తయారై ఉండును.

మీకు బాగా అర్థమగుటకు గణితరూపములో వివరిస్తాను చూడండి. చిన్న గుణమునుండి పెద్ద గుణము వరకు ఎలా పరిమాణము ఏర్పడినదో సంఖ్యలలో వివరిస్తాను చూడండి. ఇది ఉదాహరణ మాత్రమేనని తెలియవలెను. ఒక దబ్బను (వెదురుబొంగులోని చీలికలను దబ్బలు అని అంటాము.) వంచితే ఎంత బలముతో తిరిగి వెనక్కు వచ్చునో దానిని ఒక దబ్బబలము అంటాము. ఆశ అను చివరి చిన్న గుణము ఒక దబ్బయంత పరిమాణము బలము కల్గియుండగా, రెండవది రెండు దబ్బలంత

పరిమాణము, బలము కల్గియున్నది. మూడవ ఆశ నాలుగు దబ్బలంత పరిమాణము మరియు బలము కల్గియున్నది. నాల్గవ గుణము ఎనిమిది దబ్బలంత పరిమాణము, బలము కల్గియున్నది. అట్లే ఐదవ గుణము 16 దబ్బల బలము, పరిమాణము కల్గియున్నది. ఆరవ ఆశ అను గుణము 32 రెట్లు దబ్బల బలము, పరిమాణము కల్గియున్నది. అట్లే ఏడవ ఆశ అను గుణము 64 రెట్లు దబ్బల పరిమాణము బలము కల్గియున్నది. ఎనిమిదవ ఆశ అను గుణము 128 దబ్బల పరిమాణము మరియు బలము కల్గియున్నది. చివరి పెద్దదయిన ఆశ అను గుణము 256 దబ్బల పరిమాణము మరియు బలము కల్గియున్నది. ఈ విధముగా ఆశ అను తొమ్మిది గుణములు పరిమాణములో చిన్న దానిని మొదలుకొని పెద్ద దానివరకు ఎలాగున్నవని చూడగా చిన్నది ఒక దబ్బ మందముకల్గి, ఒక దబ్బ బలము కల్గియున్నది. చిన్న ఆశనుండి చివరి పెద్ద ఆశ వరకు చూస్తే చివరి పెద్ద ఆశ 256 దబ్బల మందము కలిగి మరియు బలము కల్గియున్నట్లు తెలియుచున్నది. ఆశ (కామము) అను గుణము ఎట్లు తొమ్మిది భాగములుగా ఉంటూ మందముతోనూ, బలములోనూ ఎట్లున్నదో అట్లే మిగత పదకొండు గుణములు పరిమాణములోనూ, బలములోనూ ఆశ అను గుణమువలె నున్నవి. పన్నెండు గుణములు ఒక్కొక్కటి తొమ్మిది భాగములుగా ఉంటూ మొత్తము 108 చీలికలుగాయున్నవి.

విషయ భావము బుద్ధికి చేరినప్పుడు అది గుణ ప్రభావముగా మారిపోవును. అలా మారిపోయినది పైన కర్మనుబట్టి యుండును. కర్మ ఎన్నవ భాగముగా ఉన్నదో అన్నవ చీలిక గుణము బుద్ధిని తగులుకొనగా అది పన్నెండింతలు హెచ్చింపబడి పూర్తి గుణ ప్రభావముగా మారిపోవును. ఈ విధముగా కర్మయొక్క తొమ్మిది భాగములలో ఏది కలదో దానికి సరిపోవు తొమ్మిది గుణ భాగములలోని ఒక గుణము బుద్ధికి చేరగా అది

పన్నెండింతలుగా గుణించబడుట (హెచ్చించబడుట) వలన గుణము అను పేరు గుణించబడు అర్థము నిచ్చుచున్నదని అర్థమగుచున్నది. ఇట్లు ప్రతి దినమూ ప్రతి విషయములోనూ మనిషి శరీరములో కర్మ భాగమునుబట్టి గుణ భాగమురాగా, అది పన్నెండింతలుగా హెచ్చించబడి బుద్ధిని అంటుకొని చివరికి జీవునిమీద ఒత్తిడి కల్గించుచున్నది. శరీరములోని పుణ్య కర్మగానీ, పాపకర్మగానీ, గుణముల ద్వారానే మనిషిని ఒత్తిడికి లోనగునట్లు చేయుచున్నవి. పుణ్యకర్మ ఆరు మంచి గుణములలో చీలికయిన 54 గుణ భాగములలోని ఒక చీలిక గుణమును ప్రేరేపించి బుద్ధికి తగులుకొనునట్లు చేయుచున్నది. అలా బుద్ధికి చేరిన గుణ ప్రభావము పన్నెండింతలుగా హెచ్చింపబడి (గుణించబడి) అంత బలము చేత జీవునిమీద సుఖము అను ఒత్తిడి తెస్తున్నది. అప్పుడు జీవుడు సుఖము అను వత్తిడిని హాయిగా అనుభవించుచున్నాడు. అట్లే కొన్ని విషయములలో పాపము యొక్క గుణము రాగా చివరికది హెచ్చింపబడి బుద్ధి ద్వారా జీవుని మీద ఒత్తిడి తేగా జీవుడు కష్టము లేక బాధ అను ఒత్తిడి పొందుచున్నాడు. ఈ విధముగా కర్మలను అనుభవించడములో గుణముల పాత్ర ముఖ్యముగాయున్నది. 108 భాగములుగాయున్న పన్నెండు గుణములు పన్నెండు చేత హెచ్చించబడి పన్నెండింతల గుణ ప్రభావమును చూపుచూ కర్మలను అనుభవింపజేయుచున్నవి.

గుణచక్రములోని ఒక గుణ భాగములో పన్నెండు గుణములున్నవి. మూడు గుణ భాగములలో మొత్తము ముప్పై ఆరు గుణములుండగా వాటినన్నింటి ప్రభావమును మాయ అను పేరుతో పిలుస్తున్నాము. మాయ అను గుణముల ప్రభావమును ఎవరూ జయించలేరని “మమ మాయా దురత్యయా” అని గీతలో కూడా చెప్పారు. దేవుడు మనిషిగా (భగవంతునిగా) పుట్టినా అతని శరీరములో కూడా గుణములుండుట వలన మాయ అను గుణ ప్రభావము భగవంతుని మీద కూడా ఉండునని తెలుపుటకు

దేవాలయములలో సాకార ప్రతిమగాయున్న భగవంతుని ప్రతిమ చుట్టూ మాయ ఆవహించి ఉన్నట్లు సింహతలాటమును పెట్టియుందురు. సింహ తలాటమును "ప్రభావలి" అను పేరుతో కూడా పిలుచుచుందురు. మాయ ప్రభావమును తెలుపునది కావున సింహతలాటమును ప్రభావలి అని అనడమూ జరుగుచున్నది. మాయ అనునది గుణముల ప్రభావముతో ఎవరినీ, ఎటువంటి వారినీ వదలడము లేదు. మాయ, దేవుడు భగవంతునిగా మనిషి రూపములో వచ్చినా ఆయనను కూడా తన ప్రభావమునకు లోపలే ఉండునట్లు చేస్తానని దేవాలయములలో ప్రభావలి అను పేరుతో సింహతలాటము కనిపించుచుండగా, నేను జ్ఞానమార్గములో ఉన్నానను వారినిగానీ, నేను స్వామీజీని అనువారిని గానీ వదలిపెట్టక చిన్నగా అజ్ఞాన మార్గములోనికి పోవునట్లు చేసి దేవున్ని తెలియకుండా చేయుచున్నది. ఎవడైతే అసలైన దేవున్ని ఆశ్రయించి ఆయననే ధర్మయుక్తముగా విశ్వసించినట్లయితే అటువంటి వానిని మాయ ఏమీ చేయదు, అట్లు కాకుండా కొద్దిగా అధర్మముగా ప్రవర్తించినా మాయ తన గుణ ప్రభావమునకు మనిషిని గురిచేసి అజ్ఞానమువైపు పంపును.

భూమిమీద పుట్టిన ఏ మనిషినైనా గుణ రూపములోనున్న మాయ దేవునివైపు పోకుండా చేయుచున్నది. మనిషి యొక్క విద్యాభ్యాసములో ఒక విద్యను నేర్చి, ఒక తరగతి దాటి ఇతను ఈ విద్యను తెలిసినవాడు అని గుర్తింపుపొందుటకు పన్నెండు పాఠ్యాంశములను పూర్తి నేర్చి పన్నెండు పాఠ్యాంశములను పరీక్షలో వ్రాసి వాటిలో నెగ్గవలసియుండును. ఒక పాఠ్యాంశములో మార్కులు తక్కువ వచ్చినా అతను ఆ విద్యను నేర్చిన హోదాగానీ, గుర్తింపుగానీ రాదు. చివరికి అతను విద్యావేత్త అని పిలువ బడుటకు ఎటు తిరిగి అతనికున్న అన్ని పాఠములలో పరీక్షయందు ఉత్తీర్ణుడు కావలసివుండును. విద్యావేత్త అగుటకు పరీక్ష ఎలా ఉండునో,

అలాగే మనిషి పూర్తి జ్ఞానవేత్త అగుటకు మాయ అను పరీక్షను నెగ్గవలసి ఉండును. అయితే దేవుని మీద సంపూర్ణ విశ్వాసము లేనివాడు ధర్మ బద్ధముగా నడువనివాడు మాయ ప్రభావమునకులోనై మాయను జయించలేక గుణములను నెగ్గలేక మాయలోనే చిక్కుకొనిపోవును. బ్రహ్మావిద్యా శాస్త్రమును విడచి ఎవడు ప్రవర్తించునో, ధర్మశాస్త్రము అంటే ఏమిటో తెలియక తనకిష్టమొచ్చినట్లు ఎవడు ప్రవర్తించునో, ప్రపంచ లాభముల కొరకు బ్రహ్మావిద్యను ఎవడు వాడుకొనునో వాడు ఎప్పటికీ మాయను దాటలేడు.

భూమిమీద ఎంత గొప్ప పేరు సంపాదించుకొన్న జ్ఞానినిగానీ మాయ వదలడములేదు. దైవదృష్ఠిలో అనగా దైవ ధర్మములను అతిక్రమించకుండా ఆచరించువాడు మాత్రమే మాయను దాటి దైవమును చేరగలడు. ప్రకృతి శక్తి మాయాశక్తిగా ఉండగా, మాయాశక్తి గుణముల శక్తిగాయున్నది. పన్నెండు గుణములశక్తి జీవున్ని దేవునివైపు పోకుండా చేయుచున్నది. మాయ అనునది దేవునికి వ్యతిరేఖమైనదా అని అంటే అట్లు కూడా కాదు. మాయను తయారు చేసినవాడు దేవుడే. దైవ నిర్మితమైన మాయను దేవుడు తన గ్రంథమైన భగవద్గీతలో "నా మాయ" అని అర్థమొచ్చునట్లు "మమ మాయా" అని అన్నాడు. దేవునికి ఎవడు ఇష్టముగా ఉండునో వానినే ప్రకృతిశక్తి అయిన మాయ తన ఆటంకము లేకుండా చేసి దైవమార్గములో ముందుకుపోవునట్లు చేయును. అట్లే దేవునికి ఇష్టములేని పనులను ఎవడు చేయునో అటువంటి వారిని మాయ తనను జ్ఞానములో ఉన్నట్లు భ్రమింప చేసి దేవునికి దూరముగా పంపును. మాయను గూర్చి, మాయ మనుషులను మభ్యపెట్టు దానిని గూర్చి, మాయ విధానములను గూర్చి ఎవరూ చెప్పలేదు, మాయను గూర్చి పూర్తిగా ఎవరికీ తెలియదు. అందువలన మాయ మనుషులను అన్ని విధముల ఆటంక పరచుచూ దేవునివైపు పోకుండా చేయగలదు. దేవునివైపే పోవునట్లు భ్రమింపజేసి దేవునికి దూరముగా పంపగలదు. దైవమార్గములో

అప్రమత్తముగా లేకపోతే నన్ను కూడా మాయ వదలదు. అందువలన ఎల్లప్పుడు జాగ్రత్తగా ఉండుటకు నేను ప్రయత్నించుచున్నాను.

ఇంతవరకు నాకు తెలిసినంత మాయను గురించి చెప్పాను. మాయను విడదీసి చూస్తే అది గుణముల రూపములో ఉన్నది. ప్రతి మనిషి శరీరములో పన్నెండు గుణముల రూపములోనున్న మాయ తన గుణముల చేత ప్రతి మనిషినీ నడుపుచున్నది. మాయను విశ్లేషించితే అది గుణములుగా ఉన్నదని చెప్పాము కదా! గుణములుగానున్న మాయ అంతయూ మనిషిమీద ప్రభావము చూపదు. ఒక్క సమయములో, ఒక్క విషయమందు, ఒక్క గుణ చీలికతో మనిషిని కర్మ అనుభవించునట్లు చేయు చున్నది. కర్మలో చిక్కుకొనునట్లు చేయుచున్నది. 108 గుణ చీలికలలో ఒక సమయములో ఒక చీలిక పని చేయుట వలన అది పన్నెండు భాగముల బలమును చేకూర్చుకొని మనిషిని కర్మలలోనే చిక్కుకొనునట్లు చేయుచూ దేవునివైపు పోకుండా చేయుచున్నది.

**ప్రశ్న :-** అంతబలమైన మాయను జయించుటకు ఏదైనా మార్గము కలదా? మనిషి ఏ మార్గమును అనుసరిస్తే మాయను దాటి దేవునివైపు పోగలడు?

**జవాబు :-** ఇంతకుముందే కొంత చెప్పాము. బ్రహ్మవిద్యాశాస్త్రమును అతిక్రమించి ఎవడు ప్రయత్నించునో, ధర్మశాస్త్రమును తెలియక అసలైన దేవున్నే మేము ఆరాధించుచున్నామని ఎవరు అనుకొందురో, బ్రహ్మవిద్యను ప్రపంచ లాభముల కొరకు ఎవరు వాడుకొందురో వారు మాయను జయించలేరని చెప్పాము. అటువంటి వారిని గుణములు భ్రమింపచేసి తనది సక్రమమైన మార్గమే అనునట్లు చేసి దేవునివైపు రాకుండా చేయును. ఇంత బలమైన మాయను జయించుటకు దేవుడే కొంత ఉపాయమును కూడా చెప్పాడు. ఆ ఉపాయములన్నియు దైవ గ్రంథములైన భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములలో కలవు.

**ప్రశ్న :-** ఆ మూడు గ్రంథములను గొప్పగ పెట్టుకొన్నవారు కూడా ముఖ్యముగా వారి మతములనే గొప్పగా చెప్పుకోవడము అను ప్రాథమిక మాయలో పడిపోయారు. మేము ఆ గ్రంథములను చదివినా అందులో మాయను జయించు ఉపాయమున్నా అది మాకు అర్థము కాలేదు. గురువులుగానున్న కొందరు పెద్దలవద్దకు, స్వామీజీల వద్దకుపోయి మాయను జయించు ఉపాయమును చెప్పమని అడిగితే, భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమున 48, 53 శ్లోకములలో ఏ కార్యముల వలన దేవుడు తెలియబడడో ఆ కార్యములనే చేయమని చెప్పుచున్నారు. దేవుడు తన ధర్మములు కావని దేనిని చెప్పాడో, వాటినే కొందరు బోధించుచున్నారు. ఇదంతయు చూస్తే దేవుని చేరు మార్గము మాకు లభిస్తుందా అని అనుమానము కల్గుచున్నది. ఇంతవరకు ఎన్నో విషయములను తేల్చి చెప్పిన మీరే మాకు అర్థమగులాగున ఏదైనా ఉపాయమును చూపగలరని ఆశించుచున్నాము?

**జవాబు :-** నీ కోర్కె మంచిదే అయినా, నీ కోర్కెను తీర్చు స్థోమత నాకున్నదని నేను అనుకోవడము లేదు. ఎందుకనగా! నేను పుట్టినప్పటినుండి ఏనాడూ నేను దేవుని జ్ఞానమును తెలుసుకోలేదు. జీవితములో బ్రతుకు తెరువు కొరకే కాలమంతా వినియోగించబడినది. నేను పుట్టినది పేద కుటుంబములో, కావున ఆహారము కొరకు ప్రాకులాడడము కొరకే కాలము గడిపాము. అందువలన ఎవరైనా నన్ను వేదాలు చదివినావా అని అడిగినా, ఉపనిషత్తులు చదివావా అని అడిగినా లేదని చెప్పవలసివచ్చినది. వేదాలు ఉపనిషత్తులు చదవని నేను చెప్పు జ్ఞానము సరియైనది కాదని చాలామంది పండితులు అనడము జరిగినది. నేను చెప్పు జ్ఞానము మీద చాలామందికి నమ్మకము లేదు. అయినా నా జ్ఞానము మీద నాకు నమ్మకమున్నది. ఎందుకనగా! నాకు నాలోని ఆత్మే బోధించు విషయములు అసత్యములు

కావని ధైర్యముగా చెప్పుచున్నాను. నేను చెప్పే జ్ఞానము నాకు గొప్పదే అయినా బయట మీకు గొప్పగా ఉండునో లేదో, నీకు నా జ్ఞానముమీద నమ్మకముంది చెప్పమంటే చెప్పగలను.

**ప్రశ్న :-** భూమిమీద దైవజ్ఞానమును బోధించు వారు ఎందరో ఉన్నారు. వారు ముఖ్యముగా వారి దేవున్ని గురించి, వారి గ్రంథమును గురించి, వారి మతమును గురించి, వారి ఆరాధనల గురించియే చెప్పుచున్నారు. అందువలన ఒక మతమును మరొక మతమూ, ఒక జ్ఞానమును మరొక జ్ఞానమూ ఖండించుచున్నది. అటువంటప్పుడు ఒకటి సరియైనదైతే మరొకటి లోపముతో కూడుకొనియున్నదని తెలియుచున్నది. అందువలన దేనిని నమ్మాలో దేనిని నమ్మకూడదో మాకు ఏమాత్రము అర్థము కాలేదు. వీటన్నిటిని గమనించిన తర్వాత అందరికంటే వేరుగా మీ బోధలుండుట వలన అన్ని మతములకు సమాన దూరములో మీ జ్ఞానముండుట వలన, దేవుడు చెప్పిన ధర్మశాస్త్రమునే మీరు సమర్థించుట వలన స్వచ్ఛమైన జ్ఞానము, స్వచ్ఛమైన ఉపాయము మీవద్దనే లభించునని అనుకొంటున్నాను. అందువలన మీరు చెప్పే జ్ఞానమునే విశ్వసించుచున్నాననీ, మాకు మాయను జయించు ఉపాయమును తెలుపమనీ కోరుచున్నాము.

**జవాబు :-** నేను నీకు చెప్పు జ్ఞానము నాకు నా ఆత్మ ఉచితముగా అందజేసినది. అందువలన నేను నీకు ఉచితముగా అందజేతును. ఉచితమైనదని ఈ బోధను చౌకగా చూడవద్దు. చాలా విలువైనదిగా భావించి తెలుసుకొనుము. మాయ అనునది గుణముల ప్రభావమని అర్థము చేసుకొన్నాము. దీనికి సాక్ష్యముగా భగవద్గీతలో "గుణమయీ మమ మాయా" అని అన్నాడు. అందువలన మాయ అను పదమును వినగానే మనిషి శరీరములోని గుణములు జ్ఞాపకమొస్తున్నవి. గుణములను జయించితే మాయను జయించినట్లే అగును. వాటిని జయించాలంటే

వాటికి సంబంధించిన విషయమంతా సంపూర్ణముగా తెలిసియుండవలెను. గుణములను గురించి అవి మొత్తము 108 భాగములుగా విభజింపబడిన వనీ, అందులో ఒక గుణము మనిషి బుద్ధిని తాకినా అది పన్నెండింతలుగా గుణించబడునని కూడా చెప్పుకొన్నాము. మనిషిని అన్ని రకములుగా ఆడించుటలో ముఖ్యపాత్ర పోషించుచున్నవని కూడా చెప్పుకొన్నాము. అటువంటి బలమైన గుణములను లేక బలమైన మాయను జయించుటకు మూడు దైవ గ్రంథములు ఒకే విధానమును తెలుపుచున్నవి. మూడు గ్రంథములలో చెప్పబడిన ధర్మశాస్త్రమును తెలుసుకోవడము వలన మాయను సులభముగా జయించవచ్చును.

మాయను తయారుచేసినవాడు దేవుడే. కావున మాయను జయించు ఉపాయమును కూడా దేవుడే చెప్పవలసియున్నది. అందువలన దేవుడు చెప్పునది అసలైన ఉపాయముగా మనము తెలుసుకోవాలి. దేవుడు ముందు మనుషులకు గుణములను మాయను కల్పించి దాని తర్వాత మాయకు మందులాంటి జ్ఞానమును కూడా మనిషికి అందించాడు. ఇంతకు ముందు గుణము అను దానికి హెచ్చించబడునదని (గుణించబడునదని) అర్థమును చెప్పుకొన్నాము. గుణము ఏదైనా దాని స్వభావము ప్రకారము లేని దానిని కల్పించి చిన్న దానిని పెద్ద దానిగా చేయును. గుణముతో చేరిన ఏ విషయమైనా అది పెరుగుటకే ఆరంభించును గానీ తరగదు. మనిషి తలలో గల పన్నెండు గుణములు పన్నెండు రకముల వ్యాపకములను కల్పించుచున్నవి. ఆ పన్నెండు రకముల వ్యాపకములోనే మనిషి జీవితమంతా ఇమిడియున్నది. ఈ విధముగా గుణము అనగా గుణించబడునది లేక హెచ్చించబడునదని తెలియుచున్నది.

మాయకు వ్యతిరేఖమైనది ధర్మము. మాయ విస్తారముగా వ్యాపింప జేయునదికాగా ధర్మము అనునది ఉన్న దానిని లేకుండా చేయునది.

**ధమ్** అను శబ్ధమునుండి **ధర్మము** అను శబ్ధము పుట్టినది. **ధమ్** అనగా **నాశనము** అని అర్థము. **ధర్మము అనగా అన్నిటికీ కారణమైన కర్మను లేకుండా చేయునదని అర్థము.** గుణము ఉంటే దానికి అనుబంధముగా కర్మ ఉంటుంది. గుణము లేకుండాపోతే కర్మ కూడా లేదని అర్థము. ఏ గుణమయితే మాయగా చెప్పబడుచున్నదో, ఆ గుణములను తగ్గించుటయే ధర్మము. భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమునందు 32వ శ్లోకమున దేవుడైన భగవంతుడు తనను గూర్చి చెప్పుచూ ఇట్లన్నాడు. **"కాలోస్మి లోక క్షయ" లోకమును నశింపజేయువాడను** అని దాని అర్థము. దేవుడు నాశనము చేయువాడననే చెప్పుకొన్నాడు. అటువంటి దేవునికి సంబంధించిన ధర్మము నాశనము చేయునదేయైయున్నది. అందువలన ధర్మము అంటే నాశనము అని అర్థము కలదు. ఇంకా వివరముగా చెప్పుకొంటే లోకము అనగా గుణ భాగమని అర్థము. ముల్లోకములు అనగా మూడు గుణ భాగములని అర్థము. తామస, రాజస, సాత్త్విక గుణ భాగములను ఆధ్యాత్మిక విద్యలో ముల్లోకములనుట గలదు. మూడు గుణ భాగములలోని 108 గుణములను నాశనము చేయు విధానమును ధర్మము అంటాము. ఉన్న దానిని లేకుండా చేయుటే ముఖ్యమైన కర్తవ్యముగా పెట్టుకొనిన దేవుని విధానమును ధర్మము అంటున్నాము. మనిషి యొక్క కర్మనూ, గుణములనూ లేకుండా చేయు విధానమును దేవుని ధర్మము అంటున్నాము.

ధర్మశాస్త్రము అంటే నిన్ను, నన్ను, సర్వమును లేకుండా చేయు శాసనములతో కూడుకొనియున్నది ధర్మశాస్త్రము. మాయ అంటే కర్మను పెంపొందించి, జగతిని వృద్ధి చేయునదిగా ఉన్నది. దానికి విరుద్ధముగా ఏర్పడినదే ధర్మశాస్త్రము. ధర్మశాస్త్రములో నిన్ను నీవు లేకుండా చేసుకొను విధానము కలదు. ఈ మాటలు వింటున్న మీకు కొంత ఆశ్చర్యము

కలుగవచ్చును. ఎందుకనగా మాయను జయించుటకు ఏ జ్ఞానమో, యోగమో, భక్తి మార్గమో, ఆరాధన క్రమమో, ఆచరణ విధానమో బోధిస్తాదనుకొంటే నాశనమును గురించి చెప్పుచున్నారే అని అనుకో వచ్చును. దేవుని విధానములో మీరు అనుకొన్న భక్తి, ఆరాధన, ఆచరణలు లేవు. దేవుని విధానమంతయు ధర్మయుక్తమైయున్నది. గుణములు హెచ్చించగా దానికి వ్యతిరేఖముగా క్షీణింపజేయడమే ధర్మము యొక్క విధి విధానమైయున్నది.

**ఆయుధమ్ అనగా మనిషి యొక్క ఆయుష్షును నాశనము చేయునదని అర్థము.** ఈ పదములో ఆయు అనగా ఆయుష్షు అనియూ, ధమ్ అనగా నాశనము అనియు అర్థము. ఆయుష్షును లేకుండా చేయు కత్తిని ఆయుధము అంటాము. మనిషిని పొడిచి చంపు కత్తిని ఆయుష్షును లేకుండా చేయునది అయినందున ఆయుధమ్ అను శబ్ధమును ఉపయోగించి చెప్పారు. ఇందులో 'ధమ్' అను పదము నాశనమును సూచించుచున్నది. 'ధమ్' అను శబ్ధమునుండి పుట్టినది ధర్మము. దేవుని విధానమంతయు లేకుండా చేయడమే అయినందున, దేవుడు ధర్మముతో కూడుకొన్నవాడని చెప్పుచున్నారు. అటువంటి దేవున్ని తెలియుటకు ధర్మములు తెలియాలి. ధర్మమును గురించి తెలిస్తే నాశనము చేయు దేవుడు ఎట్లున్నదీ తెలియును. అందువలన దేవున్ని తెలియుటకు ధర్మమును శాస్త్రబద్ధముగా తెలియవలెను. అలా దేవుని శాసనములతో కూడుకొన్నదే ధర్మశాస్త్రము.

ప్రపంచమును వృద్ధిచేయుచూ, జన్మలను కలుగజేయుచూ మనుషులను పెంచి పెద్ద ప్రపంచముగా మాయ చేయగలిగినది. అటువంటి ప్రపంచములో మనమంతాయున్నాము. మనకు జన్మలు లేకుండాపోయి జన్మరాహిత్యమును పొంది, జగతిలో లేకుండా పోవుటకు దేవుని ధర్మములను తెలియాలి. దేవుని ధర్మములున్నదే ధర్మశాస్త్రము. దేవునికి సంబంధించిన

భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములలో ధర్మశాస్త్రము పూర్తిగా ఇమిడియున్నది. అందువలన ఆ మూడు గ్రంథములను దైవ గ్రంథములని అంటున్నాము. ఆ మూడు గ్రంథములలో కర్మను లేకుండా చేసుకొను విధానమే ఉన్నది. అన్నిటికీ కారణమైన కర్మ లేకుండాపోతే కర్మ వలన కలుగు గుణములు కూడా లేకుండాపోవును. గుణములు లేకుండాపోతే గుణముల ప్రభావముతో కూడుకొన్న మాయ కూడా లేకుండా పోవును. మాయలేనప్పుడు దేవుడే మిగిలిపోవును. మాయలేని సమయములో మనిషి శరీరములోనేయున్న దేవుడు మనిషికి తెలియును. అటువంటివాడు జగతిలో లేకుండాపోయి పరములో చేరిపోవును, అనగా మోక్షము పొందును. ధర్మశాస్త్రము అంటే అందరూ ఊహించుకొన్నట్లు లేదు.

సృష్ఠి ఉన్నంతవరకు అందరికీ దేవుని ధర్మములు తెలియుటకు ధర్మములు గ్రంథరూపమైయున్నవి. ధర్మశాస్త్రము మూడు గ్రంథముల రూపములోయున్నది. అందువలన మూడు గ్రంథములను ధర్మశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములని చెప్పవచ్చును. శాస్త్రము అనగా శాసనములతో కూడుకొన్నదని అర్థము. ఇక్కడ శాస్త్రము వేరు, గ్రంథమువేరుగా చెప్పడమైనది. శరీరములోనున్న గ్రంథిని ఉత్తేజపరుచునది గ్రంథము. శరీరములోనున్న దైవమును తెల్పునది ధర్మశాస్త్రము. శరీరములోని కన్నీటి గ్రంథిని ప్రేరేపించు విషయములున్న పుస్తకమును గ్రంథము అని అనవచ్చును. అటువంటి గ్రంథమును చదివినప్పుడు ఆనందభాష్పములు కంటినుండి రాలగలవు. ధర్మశాసనములున్న ఏదైనా గ్రంథమే అగును. ఆ గ్రంథము మనిషిలో క్రొత్త ఉత్తేజమును నింపి, దైవమును తెలియుటకు సహకరించును. మేము వ్రాసిన విషయములు ధర్మమునకు సంబంధించినవైనందున మేము వ్రాసినవన్నియు గ్రంథమే అయి వుంటాయి. ఈ చిన్న వ్రాతలో ముఖ్యమైన ధర్మములుండుట వలన ఇది గ్రంథమే, ధర్మశాస్త్రమే.

**సమాప్తము**

